# మెహెర్ గీత



జి.వి.జి.కె.చంద్రమౌళీశ్వరరావు

# మెహెర్ గీత



రచన :

జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు

ప్రచురణ :

అవతార్ మెహెర్‌బాబా
పాలకొండ సెంటర్
పాలకొండ

II

MEHER GEETHA



Compiled By :
G. V. G. K. CHANDRA MOULESWARA RAO

First Edition :
2nd OCTOBER 1996

Price : Rs. 10-00

For Copies :
Sri Krishnam Naidu G.
AVATAR MEHER BABA PALAKONDA CENTRE
PALAKONDA
Srikakulam District.

Printed at :
D. B. PRINTERS
Arundalpet, Vijayawada-2

With best compliments from :
LATE MENDA PARVATHAMMA
PALAKOND1.

# తొలి పలుకు

భగవంతుడు అనంతశక్తి, జ్ఞాన, ఆనందములు కల త్రిగుణాత్మకుడు ఆయన మానవుల మధ్య మానవుడై అవతరించినప్పుడు అవతారుడవుతున్నాడు. మన కాలంలో అలా అవతరించిన అవతార్ మెహెర్‌బాబా నిర్వహించిన మంత్రాంగ సారాంశాన్ని క్లుప్తంగా "మెహెర్‌గీత" అనే పేర గ్రంథస్థంచేసే అవకాశం దొరకటం, నా అదృష్టం. పాలకొండ మెహెర్ సెంటరుపై తన అపారకరుణను కురిపించి అవ్యాజానురాగాలను ప్రవహింపచేయుట ద్వారా కీ॥ శే॥ మెండా పార్వతమ్మ (కీ॥ శే॥ మెండ నారాయణ, అనంతమ్మగార్ల సుపుత్రిక) గారి స్మారకార్థం ప్రియతమ మెహెర్ దేవుని అవతార విశిష్టతను యీ గ్రంథ రూపంలో అందించే అవకాశం నాకు లభింపచేసినందుకు సో॥ కృష్ణంనాయుడుగారికి ధన్యవాదములర్పిస్తూ దివంగత సో॥ మెండా పార్వతమ్మగారి ఆత్మకు శాశ్వత శాంతిని ప్రసాదించాలని ప్రార్థిస్తూ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాను. తన జీవిత కాలంలో ఆయన చేతులు మీదుగా కోట్లాదిరూపాయలు మారకమయ్యాయి ఇంద్రభవనాలలో గడిపాడు. పూరిగుడిశలలో ఉన్నాడు. అయితే తన కంటూ ఒక్క సమాధితప్ప మరింకేం మిగుల్చుకోలేదు. భ్రష్టత్వాన్ని కల్పించే ధనానికి అతీతుడని నిరూపించిన అవతర్ మెహెర్‌బాబా. ఘన వైభవాన్ని వ్రాసిపెట్టమని సో॥ జి కృష్ణంనాయుడుగారు కోరగానే నా25వ రచనగా "మెహెర్‌గీత"ను అందించే అవకాశం నాకు దొరికినందుకు నా ప్రియతమ ప్రభువుకు కృతజ్ఞతాభివందనములర్పిస్తున్నాను.

ఆరోగ్యం అనుకూలించకపోయినా, ప్రభుపద సేవలో నిరంతర బాబా నామస్మరణకు అవకాశమిచ్చి, తన అద్వితీయ ప్రేరణద్వారా, సంకలన పరచిన "మెహెర్‌గీత" అందరికీ ఉపయోగపడి మెహెర్ అవతార విశిష్టతను వివరంగా తెలుసుకునే అవకాశం లభింస్తుందని ఆశిస్తూ, అందరికి జై బాబా!

నూజివీడు
2-10-96 జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

IV

# నమస్సుమాంజలి

అనంతుడైన ప్రియతమ అవతార్ మెహెర్‌బాబా దివ్యచరణారవిందములకు హృదయ పూర్వక నమస్సుమాంజలు లర్పిస్తూ మా పాలకొండ మెహెర్ సెంటరు తరపున తొలిసారిగా యీ యుగావతారుని దివ్య చరితమును మా పరిసర ప్రాంతాల వారికి అందించాలన్న మా ప్రయత్నం, యీ గ్రంధ ప్రచురణ ద్వారా నెరవేరినందుకు నాకు చాలా ఆనందంగా వున్నది. ప్రియతమ బాబా వారు తన ప్రేమాశీస్సులను మా సెంటరుపై ఎంతగా కురిపిస్తున్నారో ఇదే నిదర్శనము. ఎంతో కాలంగా ప్రియ సోదరులు శ్రీ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు (మెహెర్ చంద్ర)గారి స్వీయ రచనను ఒక దానిని స్వీకరించి మా సెంటరు ద్వారా ప్రచురించాలని నాలో మెదిలిన కోరిక ఇప్పుడు నెరవేరినందుకు ప్రియతమ బాబాకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

25-8-96న శ్రీ మెహెర్‌చంద్రగారిని బొబ్బిలి సెంటరు నూతన భవన ప్రారంభోత్సవ సందర్భంగా కలిసి, నా మదిలోని కోరికను వారికి వెలిబుచ్చగా, ఆ వెంటనే వారు తమ సమ్మతిని తెలియపరచుటయేగాక, స్వల్ప వ్యవధిలోనే యీ అద్భుత మెహెర్ గీత రచనను పూర్తి చేసి, అచ్చు పనిని సైతము స్వయంగా పర్యవేక్షించి గ్రంధ ప్రచురణను పూర్తి చేశారు. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములర్పిస్తున్నాను.

ఈ మెహెర్ గీత గ్రంధ ప్రచురణకు అవసరమైన, ఆర్ధిక వనరులను సమకూర్చిన ప్రేమ మూర్తిని ఈ శుభసందర్భంలో స్మరించుట నా ముఖ్య కర్తవ్యము తన జీవిత కాలములో పాలకొండ బాబా సెంటరు కార్యక్రమాల్లో తన అమూల్య సహాయ సహకారములందించిన కీ॥ శే॥ మెండా పార్వతమ్మగారి జ్ఞాపకార్ధం, ఆమె సమకూర్చిన సహాయంతో, దైవ ప్రేమికులు, సత్యాన్వేషకులకు ఉపయుక్తముగా ఉండునట్లు యీ గ్రంధము అందించబడుతోంది. దాత మెండా పార్వతమ్మగారి ఆత్మకు శాశ్వతశాంతిని ప్రసాదించి, బాబా ప్రేమాశీస్సులు పుష్కలంగా లభించాలని ప్రార్ధిస్తున్నాను. జై బాబా!

పాలకొండ
2-10-96

జి. కృష్ణంనాయుడు

# ౧

# మెహెర్ గీత

మేము హిందువులం. మాది హిందూమతం. మేము క్రిష్టియనులం. మాది క్రీస్తుమతం. మేము మహమ్మదీయులం. మాది మహమ్మదీయ మతం; మేము జోరాష్ట్రియనులం, మాది జోరాష్ట్రియన్ మతం అంటూ మతపర అడ్డుగోడల్ని కట్టుకొని మానవాళి తమ మానసిక భౌతిక ప్రతీకను అత్యున్నత స్థితికి చేర్చలేకపోతున్నది. మానవుడు తన అంతర్గత యదార్థ స్థితిని అజ్ఞానం వల్ల గ్రహించలేక మాయా వలయంలో చిక్కుకుపోయి, బాహ్యంగా తాను చూస్తున్నదంతా సత్యమన్న భావంలో మునిగిపోతున్నాడు. అవాస్తవికతకు, వినియోగమునకు ప్రాధాన్యతను ఇవ్వటం మానవ స్వభావం. మన మానవదృష్టి, చేసే కర్మకు జరిగే చర్యకు వెనుక ఉన్న శక్తిని చూడదు. నిజానికి ఏ శక్తిని వ్యక్తం చేయుటకు అవి ప్రతీకలుగా నిలిచాయో, వాటి వెనుక దాగి వున్న భావమేదో, ఆ శక్తిని, ఆ భావాన్నిబట్టే వాటి విలువ ఆధారపడి వుంటుంది.

ఆధ్యాత్మిక విషయంలో కూడా ఇది అక్షరసత్యం. ఉన్నది భగవంతుడు ఒక్కడే తక్కినదంతా మిథ్య. ఇది మెహెర్‌బాబా ప్రవచించిన పురుషోత్తమ భావము. తన కర్మను ప్రకృతి యాంత్రికంగా నిర్దేశించుట లేదు. కర్మానుసారంగా పరమాత్మ ఇచ్ఛయే ఆయా కర్మలను చేయిస్తోంది. అసలు కర్మలన్నిటినీ పరమేశ్వరునియందు సమర్పించుట వ్యక్తిగత కర్తృత్వాహంకారం తొలగిపోవుటకు ఒక సాధనము. "నిన్ను నీవు మరచి సర్వము నాయందే సమర్పించుము. నేను నీకు సహాయపడెదను" అన్నారు మెహెర్‌బాబా.

సర్వకర్మను ప్రేరేపించి, నిర్దేశించునది సాక్షాత్తు దైవమే కాని, భౌతిక ప్రకృతి కాదు. ఈ ప్రకృతిలో ఉన్న యాంత్రిక నిర్వహణా శక్తి దైవగమనాన్నే అనువర్తిస్తుంది. మనలోనే అంతర్లీనమై యున్న జ్ఞానాన్ని

మేల్కొలుపుటకు దివ్య పురుషుడైన పురుషోత్తముడు దిగివస్తాడు. బాహ్య జీవనంలో జరిగే ప్రకృతి వ్యవహారాలన్నీ యథావిధిగా సాగిపోతున్నట్లు కనిపించే ఆ పురుషోత్తముని వ్యక్తిత్వం హద్దులు లేనిది. అవిభాజ్యమైనది. ఆయన రూపం అనంతత్వానికి ఒక స్వతంత్రమైన ముూస, సజీవమైన ముసుగు.

భగవంతుడు మానవరూపధారిగా అవతారాలెత్తి దుష్టశిక్షణ, శిష్ట రక్షణ, ధర్మ సంస్థాపన అనే కార్యాలను నిర్వహిస్తాడని గీత బోధిస్తుంది. అంటే నిర్గుణ నిరాకారుడైన భగవంతుడు. సగుణసాకారుడై అవతార మెత్తి దివ్య జన్మ, దివ్య కర్మలనే విధానాలను తన ఉదాహరణ ద్వారా మానవాళికి వ్యక్తపరుస్తాడు. మన ఆధునిక మనస్తత్వానికి ఈ అవతార భావాన్ని అంగీకరించటం కొంత కష్టం కావచ్చు. అయినా మెహెర్‌బాబా అవతార పరంపరను ఒక పరిణామ క్రమంగా విశదపరిచారు. "నేనే రాముడను. కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదును నేనే. ఇప్పుడు మెహెర్‌బాబాను నేను పురాణ పురుషుడను" అని ప్రకటించారు.

అవతారముల ప్రస్తావన భగవద్గీతలో ఉన్నది. అయితే ఈ అవ తారాలెన్ని అవి ఏవన్న విషయంలో మత భేదాలున్నాయి. సాంప్రదాయ కంగా హిందువులకు దశావతారాలు ప్రసిద్ధి. ఈ పది అవతారాలు కూడా పరిణామ క్రమంలోకే వస్తాయి. మొదటి మూడు అంటే మత్స్య, కూర్మ, వరాహాలు జంతువులు నాల్గవది జంతువు- మనుష్యుడు నరశింహుడు. ఆ తదుపరి అవతారము వామనమూర్తి. పిమ్మట, తీవ్ర అసురీ మానవుడు పరశురాముడు, దివ్య ప్రకృతి గల శ్రీరాముడు, ఆధ్యాత్మిక జాగృతిని పొందిన బుద్ధుడు వచ్చారు.

భాగవతంలో భగవంతుడు ఎత్తిన అవతారాలు ఇరవై ఒకటని ఉన్నది. అయితే మెహెర్‌బాబా ఈ సృష్టి ఆరంభం నుంచి ఇప్పటివరకు 5228 సార్లు భగవంతుడు మానవరూపంలో అవతరించి అవతారుడిగా అభివ్యక్తమైనట్లు ప్రకటించారు. భాగవతంలో చెప్పిన 21 అవతారాలు తర్వాత రాబోయే అవతారం కల్కిని 22వ అవతారుడిగా పేర్కొన

బడింది. బాబా నిర్వచించిన సృష్టి పరిణామమంతా యీ దశావతారాల్తో పోల్చుకోవచ్చును.

జలచరమైన మత్స్యము తొలి అవతారము తరువాత అవతారము కూర్మము ఉభయచరము. తదుపరిది వరహావతారము కేవలం నేలమీదే ఉండే జంతువు. ఆ తరువాత అవతారము నరసింహావతారము. మానవు నికి జంతువుకు వారధి వంటివాడు. మరల వచ్చిన వామనుడు పొట్టివాడై భౌతికంగా వృద్ధి చెందకపోయినా సమస్త ప్రపంచాన్ని స్వంతం చేసుకొని ఆక్రమించిన అద్భుత దైవంగా అవతరించాడు. పరుశురాముడు రాజసికావ తారుడు దివ్య ప్రకృతి గల శ్రీరాముడు సాత్వికావతారుడు. బుద్ధుడు నిర్గుణావతారుడు. ఈ అవతారులందరూ చేసిన కార్యక్రమం మానవ చైతన్యాన్ని అజ్ఞానయుత మాయా మోహంనుండి బయట పడేట్లు మేల్కొ లిపి దివ్య చైతన్యంలో దైవసన్నిధికి చేర్చటమే. అంతా ఎదురుచూస్తున్న కల్కి అసుర శక్తుల్ని ధ్వంసం చేయుటకు ఆధునిక మనస్తత్వాని కను గుణ్యంగా ఈ పృథ్విపై దైవరాజ్య స్థాపన చేయుటకు అవతరిస్తాడని ఎదురు చూస్తున్న తరుణంలో యీ యుగాంతంలో అదే భగవంతుడు మెహెర్‌బాబాగా అవతరించాడు.

భగవంతుడు మానవ రూపాన్ని ధరించి యీ పుడమిపై అవత రించుట ఎలా సంభవిస్తున్నదో తెలుసుకుందాం. అవతారునికి చెందిన భౌతిక రూపాన్ని గురించిన వివరణ గీతలో ప్రస్తావన లేకపోయినా, అవతారుడి దివ్యజన్మ, దివ్యకర్మల గురించి మెహెర్ అవతారంలో ఎంతో విశదమైంది. ఒక సాధారణ మానవుడిగా, షెరియార్జీశిరీన్ మాయిబ ముద్దు బిడ్డగా జన్మించినా, అతని అంతరంగంలో దైవం అవతరించి పంచ సద్గురువుల ప్రభావంతో ఆ మానవ అంతరాత్మను తనలోకి పైకి ఎత్తటం జరిగింది.

మనకు కావలసింది అంతర్గత క్రీస్తు, అంతర్గత కృష్ణుడు, బుద్ధుడు లేదా అంతర్గత మెహెర్‌బాబా. అంటే అంతర్గత దివ్య చైతన్యం. క్రీస్తు తదాది పేర్లు కావు. అవన్నీ చైతన్యమునకు చెందినవి. క్రీస్తు చైతన్యము, కృష్ణ చైతన్యము, బుద్ధ చైతన్యము, మెహెర్ చైతన్యము.

ఆయా చైతన్య కాలాల్లో ఆ అవతారులు గడిపిన బాహ్య జీవితం అపార ప్రాముఖ్యతను సంతరించుకొని తమ యదార్ధ అంతర్గత స్థితిని ప్రకటించుట జరిగింది.

భగవంతుడు మానవ రూపాన్ని ధరించి ఈ భూమిపై అవతరించే అవతార ప్రక్రియను పరిశీలిద్దాం. వాస్తవికతకు, వినియోగమునకు ప్రాధాన్యత నివ్వటం మానవుల స్వభావము. కనుక ప్రతికర్మ, ప్రతిచర్య ఏదో ఒక శక్తికి ప్రతీకలవుతాయి. అయితే సాధారణ మానవ మేధస్సు ఆయా కర్మలకు చేతలకు వెనుక దాగివున్న శక్తిని తెలుసుకోలేదు. అందుకే అవతారుడిగా అవతరించిన దైవాన్ని, ఆయన స్వభావాన్ని, ఆయన నిర్వహించే పాత్రని క్షుణ్ణంగా అవగాహన చేసుకుంటేనే ఆయన కార్యక్రమ ప్రక్రియను అర్థం చేసుకోగలుగుతాం. అవతారుడు మానవ రూపంలో అభివ్యక్తం అవుతున్నాడు కనుక అయన నిర్వహించే కర్మ బాహ్య స్వరూపాన్ని బట్టి మాత్రమే కాక, అంతరంగంగా పనిచేస్తుంది.

అవతారుడి దివ్య శక్తి దివ్య ధర్మాన్ని నిర్వహించుట ద్వారా, బాహ్య ప్రపంచాన్ని పునర్నిర్మాణం చేయుటకోసం చర్య- ప్రతిచర్య, పురోగమనము—తిరోగమనములనే ద్వంద్వ నియమాల ద్వారా మానవ జాతి ముందడుగు వేసేట్లు సహాయపడతాడు. అంతర్గతంగా వున్న అవతారుడి దైవోన్ముఖ చైతన్య దివ్యశక్తి మానవాళి అంతరాత్మపై పనిచేస్తుంది. అవతారుడు ఏకకాలంలో బాహ్య రూపంతోను, అంతరంగ రూపంతోను పనిచేసి ఆధ్యాత్మిక బీజాన్ని మానవ హృదయాల్లో నాటి, మానసిక క్రియాశీల పరివర్తనతోపాటు ఆధ్యాత్మిక పరివర్తనను కలిగించుటకు నాయకత్వం వహిస్తాడు.

ధర్మం నశించి, అధర్మ ప్రాబల్యం బలిష్టమై విజృంభించినప్పుడు అవతారుడు ఆవిర్భవించి కొడిగట్టిన ధర్మ జ్యోతిని పునరుద్ధరిస్తాడన్నది గీతబోధ. ఇక్కడ ధర్మము. అధర్మము అనువాటి భావాలు, మానవులాచరించే కర్మల ద్వారానే వ్యక్తమవుతాయి. కనుక భగవంతుడు యుగానికి ఒకసారి (అనగా 700 నుండి 1400 సం॥ మధ్యకాలం ఒక యుగం) మానవ రూపధారిగా అభివ్యక్తమవుతూ ఉంటాడు. ప్రతి అవతరణలోను

ఆ సమయములో ఉండే అవసరాన్ని బట్టి, అప్పటి మానవాళి దానిని స్వీకరించే సామర్థ్యాన్ని బట్టి, భగవదవతారము సత్యమును విశదపరచుట జరుగుతుంది. మనకాలంలో మెహెర్‌బాబా ఆధ్యాత్మికత గురించి, ఇంతకు మునుపు తెలియని అనేక విషయాల్ని బహిర్గత పరచారు. అలా ఆయన బహిర్గత పరచిన వాటిల్లో 7000 మందితో కూడిన ఆధ్యాత్మిక గురుపీఠం గురించిన వివరణ ముఖ్యమైనది. ఈ గురుపీఠంలోనివారు భౌతిక ప్రపంచంలో భగవంతుని వైభవము కృప, శక్తి, ఇచ్ఛ, జ్ఞానము, దయ, ప్రేమ, సత్యముల గురించి స్పష్టపరుస్తారు.

ఈ 7000 మంది ఆధ్యాత్మిక వ్యక్తుల్లో 56 మంది, దైవ సాక్షాత్కారం పొంది ఉంటారు. వీరిలో అయిదుగురుని సద్గురువులంటారు. వీరు అంతుచిక్కని యీ విశ్వముల ఏర్పాటును, వాటి గమనాన్ని అజమాయిషీ చేస్తారు. అనగా ఈ పుడమిపై వీరు భగవంతుని కర్తవ్యాన్ని నిర్వహించే ముఖ్యులు అన్నమాట. 1955 నవంబరులో మెహెరాబాదులో జరిగిన మెహెర్ ప్రేమిక సహవాస్‌లో చతురోక్తిగా "యీ ప్రపంచంలోని అయిదుగురు గొప్ప దొంగలు, తమ కాలంలో ఉండే పంచ సద్గురువులే వీరు తరచూ ప్రజల హృదయాల్ని దొంగిలిస్తారు. ఆయా నియమిత కాలాల్లో, వీరు నన్ను కూడా దొంగిలించి మీ మధ్యకు తెస్తారు అంటూ అవతార ప్రస్తావన చేశారు మెహెర్‌బాబా.

ఒక సద్గురువు అనగా కేవలము తాను భగవంతుడిగా అగుటయే కాక, దైవ సాక్షాత్కారము పొందాక, సాధారణ మానవుని మామూలు చైతన్య స్థాయికి దిగి వచ్చి ఏకకాలంలో దైవ చైతన్యంతోపాటు స్థూల, సూక్ష్మ, మానసిక చైతన్యానుభవాల్ని కూడా కలిగి వుంటాడు. అసలు భగవంతుడు అంటే అనంత ప్రేమ. మనలో నిద్రాణమైయున్న ప్రేమను యీ దివ్య ప్రేమ మేల్కొలపాలి. కనుక గురువుకు మనము ఆకర్షితులమవుతున్నాం. దానినే మెహెర్‌బాబా ప్రజల హృదయాల్ని దోచుకోవటమన్నారు. ఈ సద్గురువులైదుగురు కలిసి ఆయా నియమిత కాలాల్లో దైవాన్ని కూడా దొంగిలించి, ఆయన్ని

మానవ రూపంలో మానవుల మధ్యకు తీసుకువస్తారు. దానినే అవతారుని అవతరణ అంటారు.

మెహెర్‌బాబా సాక్షాత్తు అవతారమూర్తి యీ ప్రపంచంలో పురుషోత్తముని ప్రతినిధి. ఆయన ఏకకాలంలో పరమ అస్తిత్వమూ, లోకేశ్వరుడైన అవతారుడు కూడా అయి వున్నాడు. ఈ సత్యాన్ని విశదంగా తెలుసుకోవాలంటే, దివ్య జన్మల కర్మల గురించి, ఆయన శాశ్వతత్వం గురించి తెలుసుకోవాలి. అవతారుడు ఎత్తే జన్మ దివ్యజన్మ. ఆయన చేయు కర్మ దివ్యకర్మ, కర్మల లక్ష్యం కోరికలనుండి, పునర్జన్మ వలయం నుండి తప్పించుకోవడం. దివ్య కర్మాచరణవల్ల దైవాన్ని చేరకలిగి పునర్జన్మ ప్రవాహంనుండి నిష్కృతులవుతారు. దివ్య సనాతనుడయిన మెహెర్‌బాబా యొక్క అవతారతత్వాన్ని గ్రహించిన వారికి, దివ్య జ్ఞానమిచ్చి, పుట్టుకే లేని జగత్పితను చేరి దివ్య జన్మను పొందుతారు. అందరి గమ్యం యిదే!

సృష్టి దాని పరిణామము, పునర్జన్మ అంతఃపరిణామము చివరకు మానవుడు పొందే ఆత్మ సాక్షాత్కారము గురించి మెహెర్‌బాబా "భగవద్వచనములు" అను గ్రంథంలో ఎంతో విపులంగా వివరించారు. భగవంతుడునించి మానవునివరకు, (బాహ్య పరిణామం) మానవుడునుండి భగవంతుడివరకు (అంతః పరిణామము) చేరే మధ్యలో జరుగునదే జీవితపు నాటకం. అసలు యీ సృష్టి అంతా దీని కోసరమే పుట్టింది.

పరాత్పర పరబ్రహ్మ స్థితిని అవలకు కూడ అవల స్థితి అన్నారు. ఈ స్థితిలో భగవంతునికి చైతన్యమూ ఉండదు- అచైతన్యమూ ఉండదు. తదుపరి స్థితి అవల స్థితి. ఈ స్థితిలో భగవంతుడు సర్వమూ తానౌతాడు. ఉనికిలో వున్న సమస్తం తానే అవుతాడు. నిరంతరం ఏకకాలంలో చైతన్యమూ అచైతన్యము రెండు కలిగి, దిగి రావాలన్న వాంఛ లేకుండా ఉంటాడు. మానవరూపంలో దైవాంశులయిన పంచ సద్గురువు లున్నప్పటికీ వారి కారణంగానే ఆయన మళ్ళీ మళ్ళీ రావాల్సి వస్తోంది. ఎందుచేత? విషయ వాంఛలకు, ఇంద్రియ భోగాలకు లోనైన మానవుడు

స్వార్థంతో తరముబడి ప్రపంచ కల్లోలానికి దారితీసినప్పుడు, విశ్వాత్మక స్థాయిలో మానవాళియొక్క ఆధ్యాత్మిక పునరుజ్జీవనపు పిలుపు వచ్చి అయిదుగురు సద్గురువులు కలిసి రూప రహితుడయిన అనంతుడిని, అవతారుడిగా అభివ్యక్తంచేసి, పరిమితుడుగా అవతరింపచేస్తారు.

నిజానికి ఈ పురుషోత్తముడు మనలో నారాయణుడుగా అభివ్యక్తమయ్యే పరమదైవము. నిరంతరం మన హృదయాల్లో అగోచరంగా ఆశీనుడయి, మన అస్తిత్వానికి, కర్మకూ ప్రభువైన ఈశ్వరుడే యీ అవతారుడు. ఆయనది సకలమానవాళిని తన వశం చేసుకొనే దివ్యజన్మ. ఈ దివ్యజన్మకు రెండు భాగాలున్నాయి. మొదటిది అవరోహణ. అనగా పరమాత్మ స్థితినుంచి దిగివచ్చి, దైవం మానవత్వంలో జన్మించుట. దైవము మానవరూపధారిగా అభివ్యక్తమగుట. ఇది శాశ్వత అవతారం. మళ్ళీ మళ్ళీ వచ్చే అవతారం. రెండవది ఆరోహణ. అనగా మానవుడు దైవంలో జన్మించటం. అంతరాత్మకు చెందిన యీ రెండవ జన్మలో మానవుడు దివ్య చైతన్యంలోనికి పైకిపోవుట.

బాబా దీనినే (GOD TO MAN – MAN TO GOD) "దైవం మానవుడి వద్దకు- మానవుడు దైవం చెంతకు" చేసే ప్రయాణంగా వర్ణించారు. మానవుడిగా భగవంతుడు అరుదెంచినప్పుడు, మానవుడా దైవీ మానవుని అడుగుజాడల్ని అనుసరించుట నేర్చుకుంటాడు. భగవంతుడు మానవుడై, మానవుడిని తనవెంట తీసుకొని వెళతాడు. మానవత్వంలోనికి దిగివచ్చిన భగవంతుడు దైవీ మానవుడు, భగవంతుని లోనికి ఎదిగిన మానవుడు మానవ దైవమవుతున్నాడు. దైవీ మానవుడు మానవత్వంలోకి సరాసరి దిగివచ్చి అవతారుడవుతున్నాడు. కాగా మానవ దైవం దైవత్వంలోకి సమగ్రంగా పరివర్తన అవుతున్నాడు. వీరిరువురూ దైవాన్ని కలుసుకొనుటకై మానవాళికి ప్రాతినిధ్యం వహించేవారే అయినా దైవీమానవుడు పరిణామానికి నేతృత్వం వహించేందుకు వస్తాడు. మానవ దైవం అలాకాకా, పరిణామక్రమదశలన్నీ దాటి దైవత్వంలో పరివర్తన అవుతున్నాడు.

ఈ ఆధునిక యుగంలో ఆధునికుల మనస్సుకు యీ అవతా

భావన కొంత అర్థరహితంగా తోచవచ్చును. ఎవరేమనుకున్నా, సమస్త ప్రపంచ వ్యవహారాలన్నీ ఒక స్థిరధర్మ యంత్రాంగ పరిపాలనకు లోబడి వుంటాయని, అదే కార్యకారణ చట్టమని బాబా వివరించారు. ఈ రీత్యా అవతారుడు ఆధ్యాత్మిక సామ్రాజ్యానికి రాజ్యాంగ బద్ధుడైన మహా చక్రవర్తి. ఆయన కాలంలో ఆధ్యాత్మిక గురుపీఠానికి సార్వభౌమాధిపత్యం వహిస్తాడు. తన ఆత్మస్థితిలో తాను పుట్టుకలేనివాడు అవిభాజ్యుడు సర్వభూతాలకు ఈశ్వరుడయినప్పటికీ, ఆత్మమాయా శక్తివల్ల ప్రకృతిని అధిష్ఠించి జన్మ తీసుకొని మానవ శరీరంలో ఆ యుగపు పంచ సద్గురువులు ఎంపిక చేసిన తల్లిదండ్రుల గర్భవాసాన పుడతాడు. మానవాళి హృదయాల్లో ప్రేమబీజాన్నినాటి, ప్రపంచానికి విముక్తిని కలిగించే కార్యక్రమాన్ని ప్రారంభించు, సమయమాయనకు ఆసన్నం కాగానే యీ అయిదుగురు సద్గురువులు, అనంతశక్తి జ్ఞానానందములను యిచ్చి ఆయనదే అయిన సకల సృష్టిని దాని నిర్వహణను ఆయనకు వప్పగిస్తారు.

ఉన్నది భగవంతుడు ఒక్కడే. తక్కినదంతా మిథ్య. అనంతుడు, అగోచరుడు, శాశ్వతుడయిన భగవంతుడిని మెహెర్‌బాబా అవధులు లేని మహాసాగరంగా పోల్చారు. సర్వమూ భగవంతునిలో వున్నది అంటే యీ మహాసాగరంలో వున్నదని అర్థం. సర్వమూ ఆయనలోనే కదులుతోంది. దానికి అస్తిత్వమున్నది. సర్వములో ఆయన ఉన్నాడు. ఆయన వర్తిస్తాడు. తన అస్తిత్వాన్ని ప్రదర్శిస్తాడు. సృష్టిలోని ప్రతి జీవి మారువేషంలో ఉన్న నారాయణుడు. కనుకనే పరిపూర్ణుడైన దైవీమానవుడు అపరిపూర్ణ మానవరూపాన్ని ధరించి సత్యాన్ని నిర్ధారిస్తున్నాడు. ఎందుకంటే అపరిపూర్ణత కేవలం మనస్సు లేదా శరీరం ఆచరించే కర్మలోనే ఉన్నది కాని వాటిని వహించిన ఆత్మకు చెందదు. అలాగే భగవంతుడు ఎక్కడో కనిపించకుండా వున్న ఏ స్వర్గంలోనో కూర్చొని యీ జగత్తును పాలించటంలేదు. తన సర్వవ్యాపకత్వం ద్వారా ఆయన పరిపాలిస్తున్నాడు.

మనం నేర్చుకోవలసిందేమంటే ఒకే భగవంతుడున్నాడని, ఆయన

అవిభాజ్యుడుగా, అనంతుడిగా, శాశ్వతుడిగా అంతటా సర్వవ్యాపకుడై ఉంటాడని గ్రహించాలి. ఉన్నది ఒకే మతము. ఏకైకుడైన యీ భగవంతుని కొరకున్న ప్రేమ మతమది. "అందరిలోను భగవంతుని చూడండి. అందరియందున్న భగవంతుడిని ప్రేమించండి" అన్నది బాబా ప్రవచనం. ఈ వాక్యాలలో సర్మగర్భితంగా ఉన్న అర్థమేమంటే, ఈ ప్రాపంచిక మాయలో జీవిస్తున్న మానవుడు, తాను చూస్తున్నదే సత్యమని భ్రమించుట వల్ల అవంటే వట్టి మాయ అని అతడు తెలుసుకునేటట్లు చేసి, దైవము యొక్క దివ్య ప్రేమకు, దయ, కరుణలను పొందే అర్హులుగా తయారు చేయుటకేనని గ్రహించాలి.

ప్రతిప్రాణి ప్రకృతి నియమావళికి బద్ధులు. కనుక ప్రకృతికి దాసులమై దాని బంధనకు మనం లోబడి ఉన్నంతవరకు మనకు స్వేచ్ఛ లేదన్నది బాబా భాష్యం. మనం చేసే ప్రతి కర్మ ప్రకృతి అధీనంలో అవశులమై చేస్తున్నాం. ఇటువంటి ప్రకృతి గుణాల నిర్బంధానికి లోబడిన కర్మబంధాల నుండి విముక్తి పొందాలంటే మనలోనే అంతర్నిహితమై వున్న ఆత్మ జ్ఞానాన్ని మేల్కొలపవలసిన అవసరమున్నది. కర్మ, ఆత్మ జ్ఞానాల సమ్మేళనం వల్ల ఉన్నతాత్మలో జీవించగలుగుతాము. కనుక మనలో నిద్రాణమైయున్న ఆత్మ జ్ఞానాన్ని మేల్కొలుపుటకే తాను వచ్చానని, ఏదో బోధించుటకు రాలేదని మెహెర్‌బాబా చెప్పారు.

ఆత్మ జ్ఞానానుభవం పొందిన మరుక్షణంలో మానవుడు, ప్రకృతికి అతీతుడై, దాని దాస్య శృంఖలాల నుండి విముక్తిని సాధించి, ఆ ప్రకృతికీ, ప్రభువైన పరమేశ్వరునితో ఏకమైపోతాడు. అప్పుడు తనలోనే ఉన్న పరమాత్మ, ప్రకృతికి ప్రభువగు ఈశ్వరుడైనందున తానాచరించే ప్రతి చర్య కర్మ పరంపరకు లోబడకుండా దివ్యేచ్ఛా ప్రయోజనాలకై వినియోగించ గలుగుతాడు. అంటే మనం దివ్యాత్మను చేరుకున్నప్పుడు, ప్రకృతికే, యజమానులవుతామన్నమాట.

అంతఃపరిణామ దశల్లో ఈ ఆత్మ జ్ఞాన వికశిత విధానాన్ని గురించి బాబా చాలా వివరంగా చెప్పారు. జ్ఞానభూమికలు, వాటిపై పయ

నించే బాబాగారి మానసిక స్థితులు, ఆత్మ సాక్షాత్కారము, సద్గురువుల గురించిన బాబా ప్రవచనాలపై తరువాత చర్చించుకుందాం. ముందుగా తెలుసుకోవలసింది మానవాత్మ ప్రకృతికి ఎలా బందీ అయిందో తెలుసుకుందాం.

మానవాత్మ గత జన్మల సంస్కారాల ప్రభావంవల్ల, ప్రకృతిలో అజ్ఞాన వశస్సై చిక్కుకుంటోంది. అతిశయ రూపు ధరించిన అహం, బుద్ధితో తాదాత్మ్యం చెంది, సాధారణ జన్మ ద్వారా అస్తిత్వముగా విడుదలైంది. ఇక్కడ అస్తిత్వము అంటే, సకల భూతములు తమను తాము సృష్టించుకోవటం తమను తాముగా ఎరిగి ఉండటం. తమకు తాముగా ఉండుటయే అస్తిత్వము. ఈ అస్తిత్వములో అవ్యక్త స్థితి, వ్యక్త స్థితులని రెండున్నాయి. నిర్గుణ నిరాకార స్థితిని అవ్యక్తస్థితి అంటారు. శూన్యము యొక్క "సోహం" అది నేనై యున్నానన్న అచైతన్యస్థితి బీజరూపమై, కారణ శరీర రూపంలో సగుణసాకార స్థితి కలిగి వ్యక్తస్థితి ఏర్పడుతోంది. ఈ వ్యక్తస్థితిలో పంచభూతాత్మకమైన భౌతిక శరీరముగా వ్యక్తమవుతోంది.

అవలకు కూడ అవలస్థితి భగవంతుని శూన్యావస్థ. ఆయన అనంత నిశ్చల అగాధ సాగరంలో యోగనిద్రలో ఉంటాడు. అటువంటి స్థితిలో ఆయనకు "కోహం" "నేనెవరిని?" అనే లహర్ ఒక సంకల్పం కలిగింది. ఇదే ప్రథమ సంస్కారమై శూన్యావస్థలో శూన్యత్వ స్థితి కలిగింది. ఫలితంగా జీవప్రజ్ఞ వ్యక్తమైంది. 'అహం' 'నేను' పుట్టింది. నేను శిలను, నేను లోహాన్ని, నేను వృక్షాన్ని, నేను క్రిమికీటకాన్ని, నేను జలచరాన్ని, నేను భూచరాన్ని, నేను జంతువును, నేను మానవుడిని అంటూ అవిక్రాంత ప్రకృతి గుణాలకు బందీ అయి శూన్యత్వ స్థితి అహమును పోషిస్తోంది. అనుభవంలో నిజానికి ఇదంతా శూన్యమే తప్ప శాశ్వతం కాదు.

'కోహం' నేనెవరిని? అన్నదాంతో ప్రారంభమైనసృష్టినిగాఢనిద్రావస్థలోమునిగిపోయి,అవిక్రాంత ప్రకృతి గుణాలకు వశమై దాస్యం చేయవలసి వస్తుంది. ఈఅహంనిజానికి సహజప్రకృతికర్మలలో వచ్చే ఒకమానసికముడి మాత్రమే. కర్మలన్నింటికి ప్రకృతిఒకసమన్వయ కేంద్రము. ఈముడినితెంచే

స్తేనే ప్రకృతికి అతీతులవుతాం. ఈ అహం మనం చేసే కర్మలకు కేంద్రంగా, వాటివల్ల లబ్ధి పొందేదిగా ఎంతమాత్రమూ ఉండకుండా చేసుకోగలిగితే యిది సాధ్యమవుతుంది. అయితే ఇది స్వయంసాధన వల్ల సాధ్యమయ్యేది కాదు. పరమాత్మ కృప కావాలి. దైవకృషి ద్వారా మాత్రమే జాగృతమైన ఈ సోహం "నేను అదై ఉన్నాను" అన్న ఎరుకను శివోహంగా మేల్కొల్ప బడుతుంది. ఆత్మ సాక్షాత్కారము అంటే ఇదే. దైవ కృప ఉంటేనే తప్ప ఇది సాధ్యపడదు.

బాహ్యంగా వ్యక్తమయ్యే ఉపాధితో ఆత్మతాదాత్మ్యం చెందుటే పరిణామ కారణం. పరిణామ క్రమంలో చైతన్యపు పాత్ర అతి ప్రధానమైనది. చైతన్యము పరిపూర్ణమైనప్పుడు, మానవ ఆత్మ సర్వసంపూర్ణమై "నేను భగవంతుడను" అన్న ఎరుక కలిగి భగవంతునితో ఐక్యమై తాదాత్మ్యం చెందును. చైతన్యము పూర్తిగా ఆత్మపై ఆధారపడి ఉన్నది. ఆత్మ పరిణామ క్రమాన్ని పూర్తిచేసుకొని మానవ ఉపాధిలో ద్వంద్వానుభూతిని పరిపూర్తి చేసుకొని దానికి అనుగుణ్యమైన రీతిలోనే చైతన్యాన్ని ఆధారము చేసుకుంటుంది.

ఈ చైతన్యము నిర్గుణ నిరాకార స్థితియందు అవ్యక్త స్థితిలో అంతర్నిహితమై ఉంటుంది. ప్రథమ సుస్కారము "కోహం" (నేనెవరిని?) కలగగానే, సాకారస్థితిలో సత్వరజస్తమో గుణములు, అనంతశక్తి, జ్ఞాన ఆనందములను ఆపాదించుకొని వ్యక్తమైన స్థితే ఆత్మ స్థితి. పరిణామ క్రమంలో ఈ ఆత్మ జీవిగా పరిగణించబడినది. మానవ ఉపాధిలో జీవాత్మ పునర్జన్మ కమంలో పయనిస్తుంది. తాను కాని స్థితిలో అది అనంతానుభవాల్లో పురోగమిస్తుంది. చైతన్యము దీనికి ఆధారము. ఇది దైవీ ప్రణాళిక, దైవవిధి. ఈ చక్రంలో పరిమితమైన ఆత్మ తన ప్రయాణాన్ని కొనసాగిస్తుంది. మన గమ్యాన్ని చేరుటకు కర్మాచరణ ముఖ్య కర్తవ్యం. కర్మల్ని ఆచరిస్తూ సర్వకర్మలతో కూడిన ప్రపంచాన్ని వదిలితేనే మన గమ్యమైన దైవాన్ని చేరగలుగుతాం.

భగవంతుడిని చేరుటను లక్ష్యంగా పెట్టుకున్నప్పుడు ఈ సృష్టి మనకు ఒక చెరసాలగా కనిపిస్తుంది. అందుకే బాబా ఏకాగ్రతతో కూడిన

దైవధ్యానం మాత్రమే దైవ సన్నిధికి చేరుస్తుందని బోధించారు. ప్రతి కర్మను అంతర్గత ఆధ్యాత్మిక కారణ రీత్యా మన లక్ష్యమైన పరమాత్మకు సమర్పించుకో కలగాలి. మన గమ్యమైన దైవాన్ని పురుషోత్తముడిగా చూడ కలగాలి. దానివల్ల నిరంకుశ అహమును దాని పరిమితిని ఛేదించి, మనదిగా భావించే ప్రపంచమనే చెరసాలను పగలకొట్టుకొని, ఈ భౌతిక ప్రపంచంలో ఉంటూనే దానికి అతీతంగా ఆధ్యాత్మిక జీవనాన్ని గెలుచుకోగలిగిన వారమవుతాం. మనము చేరవలసిన లక్ష్యం, పురుషోత్తముడిగా మనకు మనము అనుభవించుట. కనుక దీనిద్వారా మనకు బాబా నేర్పదలచినది, ఆధ్యాత్మిక, సాధనకు అంతిమలక్ష్యం పురుషోత్తమ ప్రాప్తిఅని, దాన్ని పొందుటకు కర్మాచరణ తప్పనిసరే అయినా నిష్కామకర్మల ఆచరణ ద్వారా గురుకృప వల్ల పొందగలరన్నదే, నిష్కామ బుద్ధితో ఆచరించే కర్మలు, దివ్యచైతన్యంలో దివ్య కర్మాచరణకు దోహదపడతాయి.

ఆచరణలో ఇది చాలా కష్టతరమైన సాధన. అందుకే బాబా కూడా ఆధ్యాత్మిక జీవనంలో అత్యంత కష్టతరమైన విషయమును ప్రస్తావిస్తూ పరిపూర్ణ మానవుడిగా ఉండటము చాలా కష్టమన్నారు. శ్రేష్ఠులు ఏం చేస్తారో వారికంటే తక్కువ స్థాయిలో ఉన్న అధములు కూడా అదే పనిని ఆచరిస్తారు. బాబా ప్రవచించిన సత్య ప్రేమ సందేశాలన్నీ అమూల్యమైనవి. అవన్నీ కొత్తగా ప్రవచించిన ప్రబోధాలు కావు. లోక సంగ్రహాన్ని దృష్టిలో ఉంచుకొని ఆయాకాలాల్లో అవతరించిన ఏకైకుడు భిన్న మార్గాల్లో ప్రవచించినవే. అయినా యీ ఆధునిక యుగంలో శాస్త్రవిజ్ఞానం అపారముగా అభివృద్ధి చెంది. సృష్టికి ప్రతిసృష్టి చేయగలిగిన స్థితికి ఎదిగిన మానవ మేధకు అనుగుణ్యంగా మళ్ళీ అదే పురాణ పురుషుడు మెహెర్ బాబా రూపంలో అవతరించి సరికొత్త పంథాలో మాటలతో పనిలేని చేతల కార్యక్రమం ద్వారా తనదైన శైలిలో మానవాళికి మేల్కొలుపు కావించారు.

ఆధునిక మానవుని దృష్టి ఎంతసేపూ ఆచరణాత్మక విధానాలపై లగ్నమై ఉంటుంది. కనుకనే బాబా తన కార్యక్రమాన్ని సేవా ధర్మం పైనే కేంద్రీకరించారు. తన శిష్యులకు సేవాధర్మ ప్రావీణ్యత ద్వారా

తాత్త్విక ధర్మాన్ని ఆచరింప చేశారు. ఎటువంటి నైతిక, వైజ్ఞానిక, పరోప కార ధర్మాల్ని ప్రతిపాదించకుండానే సకల జీవకోటిలో నివసిస్తున్న భగ వంతునితో ఆధ్యాత్మికంగా ఏకత్వాన్ని పొందవలసిన అగత్యాన్ని నొక్కి చెప్పారు. మనము సాఫల్యతను పొందవలసింది పరమాత్మలో, అలాగే మన అహాన్ని త్యజించవలసింది కూడా పరమాత్మ సన్నిధిలోనే. అంతే కాని, మన అహాన్ని ఏ సంఘానికో, వ్యక్తికో కాదని తెలుసుకోవాలి.

మెహెర్ సాహిత్యపు అంతర్భావాన్ని నిశితంగా పరిశీలిస్తే, అవతా రుడి సాంగత్యంలో ప్రాప్తించే అత్యున్నత భావాలు, అనుభవాలు మాత్రమే ఆధునిక మనస్సును శాశ్వత పరిచి మనోనాష్ కలిగిస్తాయని, సమగ్ర సత్య మార్గంలో పురోగమించుటకు దోహదపడతాయని ప్రబోధిస్తుంది. ముఖ్యంగా మానవుడు ప్రస్తుతం తానున్న ఉపాధిని దాటి దివ్య మానవుడిగా అనుభవం పొందుట అత్యంతావశ్యకమని ఉపదేశిస్తుంది. మనది ఆర్ష సాంప్రదాయం. ఈ సనాతన ఆచార సాంప్రదాయంలో మునిగిన భారతీయ సాంఘిక ప్రవృ త్తిని, మెహెర్‌బాబా ఆచరించిన విశ్వకార్యక్రమ విచారణ పద్ధతి, ఏదో ఒక మత విచారణా ఆధ్యాత్మిక చింతనగా కాక, వ్యక్తి వికాసాన్ని, అత్యు న్నత అవసరాన్ని, ఆధ్యాత్మిక స్వేచ్ఛను, అగ్రస్థానంలో ఉండేట్లు మలి చిందనుటలో సందేహం లేదు. వ్యవస్థీకృత మానవ సమాజ లక్ష్యంతో మానవుడు మునిగిపోవటం వల్ల దైవ చైతన్యంలో తనను తాను మించి పోవాలన్న లక్ష్యాన్ని మరచి, దైవ చైతన్య హోదాను పొందలేకపోతు న్నాడు. అల్పమైన స్వీయ ఆత్మను వదలి, తనలో నిగూఢంగా అంతర్ని హితమై చరిస్తున్న పరమాత్మను కనుగొని దివ్యత్వాన్ని పొందటమే మన గమ్యమని బాబా మరీమరీ చెప్పారు.

ఎప్పుడో అయిదువేల సంవత్సరాల క్రితమే శ్రీ కృష్ణ పరమాత్మ, మీరంతా భగవత్స్వరూపులే. స్వయంగా జ్ఞానమే మీ స్వరూపమని ప్రవచిం చాడు. జ్ఞానమనేది కొత్తగా ఇచ్చేది కాదు. అది తొలుత నుండీ అందరిలో ఉంటుంది. అయితే అజ్ఞానమనే తెరవల్ల అది మరుగున పడిపోయింది. ఈ తెరను తొలగించి జ్ఞానాన్ని మేల్కొలుపుట ఒక సద్గురువుకో లేదా అవతా రుడికో మాత్రమే సాధ్యపడుతుంది. కేవలం వారి కృపవల్ల మాత్రమే ఈ

జ్ఞాన తేజస్సు మానవునిలో వెలిగించబడుతుంది. కనుక ఇక్కడ కృప అనేది తప్పనిసరి. అందుకే బాబా అంటారు

"తన కృప అందరిపైన సదా ప్రసరింపబడుతోంది" అని. కానీ తప్పంతా మనలోనే ఉన్నది. మనమూ కృపను కోరుకోవటంలేదు. ప్రాపంచిక కోరికలతో మునిగిపోయి కోరతగినదాన్ని కోరలేకపోతున్నాం. మన మాయన కృపకు పాత్రులం కావాలంటే ఆయనకు సర్వార్పణము కావాలి.

నిజానికి సర్వార్పణ అవటం చెప్పినంత తేలిక కాదు. ప్రపంచ సంబంధాలతో సంచరించే సాధారణ మానవుడు తన ప్రవర్తనలో నిష్కా షిక భావాన్ని, తాను చేసే కర్మలోని వైవిధ్యాన్ని తెలుసుకోలేడు. దివ్య కర్మ పరాయణుడు, సత్యనిష్ఠుడైన కర్మయోగి మాత్రమే, ఆత్మ చైతన్యంలో జీవిస్తూ కర్మాచరణ చేస్తాడు కనుక త్రిగుణాలకు అతీతుడై, ప్రశాంత స్థిరత్వాన్ని కలిగి ఉంటాడు. వ్యక్తిగత ప్రయోజనాలు లేని లక్ష్యంతో నిష్కాముడై తాను దేనికీ కర్తను కానని గ్రహించి, కర్తృత్వాహంకారమును వదిలిపెట్టకలిగినవారికే జగత్తులోని అనేకత్వంలో సైతం, సమత్వంతో కూడిన ఏకత్వ జ్ఞానం అనుభవమవుతుంది. కోట్లాది అసమానతల మధ్యనున్న సర్వాన్ని సమస్థితిలో ఉంచగల ఆత్మచైతన్యానుభవం అట్టివారికే లభిస్తుంది. సంపూర్ణ సమత్వ భావన అలవడటమే సర్వార్పణకు సోపానం. న్యాయానికి ప్రపంచంలో ఎటువంటి స్థితిలోనైనా సరే అసమానతవల్ల కలిగే భేదాలు తప్పకుండా ఉంటాయి. కనుక సర్దుబాటుతో సాదృశ్యభావన ఉంచవచ్చేమో కాని సమానత్వం చేకూరదు.

మెహెర్‌బాబా సమానత్వం గురించి ఎంతో చెప్పారు. "నీవు-నేను ఇదువురం కాదు ఒక్కరే" అన్నారు. నేనన్న అహమే మానవుని పతనానికి మూల కారణమవుతోంది. దైవసాక్షాత్కారం చేసినా "నేను చూస్తున్నాను" అన్న అహం ఇంకా మిగిలే ఉంటుంది. దైవోన్మత్తుడైనప్పటికీ, చేతనాచేతనవ్యవస్థలో చిక్కుకుపోయి ముందుకు సాగలేడు. వెనుకకు మరలలేని స్థితిలో ఉంటాడు. దైవాన్ని ప్రేమించవలసిన రీతిలో ప్రేమించినప్పుడే ఆయనకు అత్యంత సన్నిహితుడై ఆయన అనుగ్రహాన్ని నిస్సంశయంగా పొందకలుగుతాడు. దైవాన్ని అత్యంత సన్నిహితంగా తెలుసుకొని అనుభ

చించటమే సమానత్వం. భగవంతుని యందు ప్రగాఢమైన ప్రేమ ఉంటేనే కాని ఇది సాధ్యపడదు. ఆయన్ని గాఢంగా ప్రేమించ కలిగినప్పుడు ఆ పరమాత్మను ఎక్కడపడితే అక్కడ సర్వత్రా చూచే భాగ్యం దొరుకుతుంది. కామెర్ల రోగికి ప్రపంచమంతా పచ్చగా కనిపించినట్లే, ఇట్టి సాధకునికి అంతటా దైవమే కనపడతాడు. తానే దైవంగా అనుభవిస్తాడు. రాత్రిం పగళ్ళు ఎవరైతే దైవాన్ని గురించే ఆలోచిస్తారో, అట్టి వారే సర్వత్రా ఆయన్ని అంటిపెట్టుకొని ఉండకలుగుతారన్నది మెహెర్ తత్వము.

దీన్ని ఒక చిన్న ఉపమానంలో చెప్పుకోవచ్చును. ఒకరు భయంకరమైన మంటలను చూచి తమ మనస్సును ఆ మంటపైనే లగ్నం చేసుకున్నప్పుడు, ఎటు తిరిగి చూచినా వారికి ఆ మంటే కనపడుతుంది. ఇక్కడ జరిగేది, వారు తమ చైతన్యాన్ని కోల్పోవటం కాదు. అసలు చైతన్యం గురించే ఆలోచిస్తున్నందున, దాన్ని కోల్పోవటం ఎలా సంభవిస్తుంది? ఇది అసత్యమైన దానిని గురించి ఆలోచించుట కాదు. సత్యాన్ని గురించి ఆలోచించుట జరుగుతున్నది. శాశ్వత జ్ఞానమే తన సహజ లక్షణమైన దాని గురించి ఆలోచిస్తుంటే, మనస్సు ఆయనపై కేంద్రీకరిస్తే మానవుడు తన చైతన్యాన్నెలా కోల్పోతాడు? అందుకే దీనిని తెలుసుకోవాలంటే ఆయన కృప కావాలి. ఆయన కృపలేందే మనస్సులో కలిగే అనుమానాలు రాహిత్యం కావు. ఆత్మ సాక్షాత్కారం జరిగినప్పుడే "నేను" అన్న అహం పోయి, అనుమానాలన్నీ పటాపంచలైపోతాయి. అప్పుడు ఏర్పడేదే నిజమైన సమానత్వం.

దీనిని బట్టి మనకు అవగతమయ్యేదేమిటి? భౌతికంగా వివిధ అస్థిత్వాలతో వ్యవహరించేటప్పుడు సర్వంతో సమానంగా ఏకము కాగలిగిన భక్తుడు దైవము యొక్క ప్రత్యేకానుగ్రహమునకు పాత్రుడవుతాడని, ఆయనతో విశిష సంబంధాన్ని స్వయంగా ఏర్పరచుకొని, సమైక్యము కాగలుగుతాడని విదితమవుతుంది. ఎవరి పట్ల పక్షపాతం కానీ, ద్వేషం కానీ లేని పరమాత్మ, సమనిష్పాక్షికతతో, అందరిపట్ల ప్రేమను కురిపిస్తాడు. అయితే ఈ ప్రేమను స్వీకరించు మహద్భాగ్యం, ఆయన్ని ప్రేమించి సేవించేవారి అంతరంగ స్థాయిని బట్టి ఉంటుంది. మానవ బల

హీనతలను అధిగమించి, అత్యంత వాంఛనీయమైన, మనోభావాల్ని అల వరుచుకుంటేనే తాత్వికస్థాయి అబ్బి, ఆత్మనిగ్రహం సాధ్యపడుతుంది. జ్ఞానం ద్వారా ఆత్మ నిగ్రహం ప్రాప్తిస్తే ఉదాసీనత, నిర్లిప్తత అలవడు తుంది. తీవ్రభావాల సుడిగుండం నుంచి, కోరికల ఊబినుండి బయటపడ కలుగుతారు. గమ్యం చేరే సాధకునికి కావలసింది సంసారంపై ఉదాశీనత (నిర్లిప్తత) ముఖ్యం. కోరికల ఊబినుండి బయటపడి, భగవంతుని ఇచ్ఛకు సర్వార్పణా పూర్వక తితిక్షతో తనకు తాను అర్పించుకొన్నప్పుడే ఇట్టి ఆధ్యాత్మిక సమత్వం సంప్రాప్తిస్తుంది.

ఇటువంటి దైవకృపను పొందినవారు, నిర్భయంగా తమ ప్రియతము నితో ఒక విశిష్టమైన దివ్య సంబంధాన్ని ఏర్పరచుకుంటారు. గీత ఏమి చెబుతోంది? “నేను సర్వభూతముల పట్ల సముడను. నాకు ప్రియుడు లేడు అప్రియుడు లేడు. ఎవరు నన్ను భక్తితో భజిస్తారో వారు నాయందే ఉంటారు. నేను కూడా వారి యందుంటాను” మెహెర్‌బాబా నేరపిన మంత్రాంగంలో ఆచరణాత్మకంగా యీ సందేశము విశదమవుతుంది. ఆయన శిష్యురాలు మెహెరా జీవితం ఇటువంటి దైవకృపకు ప్రత్యక్ష తార్కాణం. భగవంతుడు కావాలనే ప్రత్యేకంగా ఏ కొందరినో తన ప్రేమికులుగా ఎంపిక చేయడు. భక్తులే తమ ప్రియతముని పట్ల ఉన్న ప్రేమవల్ల ఆయనతో సాన్నిహిత్యాన్ని, సమత్వాన్ని కలిగించుకుంటారు.

మెహెరా జహంగీర్ ఇరాని, మెహెర్‌బాబా పెత్తల్లి పవులత్‌మాయి కూతురు. 14 ఏళ్ళ వయస్సప్పుడే బాబా ఆశ్రమవాసిగా ఆయన శిష్యురా లైంది. యుగావతారునికి ఆధ్యాత్మిక సహాయకురాలిగా, ప్రియాతిప్రియ మైన పరిశుద్ధ ఆత్మగా తన శాశ్వత ప్రియతమునికి సేవలొనర్చిన ధన్య జీవి. బాబాయే స్వయంగా ఆమె గురించి చెపుతూ “ఈ జగత్తులో రామునికి సీతలా, కృష్ణునికి రాధలా, జీససుకు మేరీ మెగ్దలీన్‌లా నాకు మెహెరా పరిశుద్ధ ఆత్మ” అన్నారు.

బాబా నిర్దేశించిన ఆదేశాల్ని క్రమశిక్షణతో పాటించింది. చాలా స్వల్పంగా కేవలం శాకాహారాన్ని తినేది. తరచూ బాబా ఆదేశాలపై

ఉపన్యాసాలు, మౌనం పాటించేది. రోజూ కొన్నివేల సార్లు బాబా నామాన్ని స్మరించేది, బాహ్య దృష్టిలో పరస్పర సంఘర్షణల మధ్య జరిగే ప్రకృతి పరమైన నిత్యకృత్యాలతో కష్టతరమైన జీవితాన్ని గడిపినట్లు కనిపించినా, మెహెరా యొక్క స్వేచ్ఛా అంతరాత్మకు దైవకృపవల్ల లభించిన సమత్వమనే అనుగ్రహం వల్ల ఆత్మ చైతన్య ఆధిక్యతను సాధించ కలిగింది. కరుణామయుడైన బాబా ప్రేమ వల్లే దాన్ని తాను పొందానన్న ఎరుక ఆమెకు ఉండేది. సమత్వానికి కర్మాచరణలో ఎంత ప్రాధాన్యత ఉన్నదో మెహెరా జీవితం నేర్పుతుంది. అంతరాత్మలో అసమత్వం ఉన్నంతవరకూ ప్రకృతి గుణాల వర్తన కూడా అసమంగానే ఉంటుంది. కోరికలు, వ్యక్తిగత వాంఛలు, భావాలు, భౌతికవాసనలపై ముసురుకున్నంత సేపు, సుఖదుఃఖాల కార్యకలాపాలు కొనసాగటం వల్ల ఆత్మ చైతన్య అధిక్యత బయటపడదు. కామనారాహిత్యం అలవడితేనే త్రిగుణాతీత స్థితి అబ్బుతుంది. ఇది లభించకుండా అడ్డుకునేది, మానసిక అసంతృప్తి. ఈ అసంతృప్తి నుంచి బయటపడాలంటే నిర్లిప్తతతో కూడిన నిరాశామయ నిస్పృహాయ జీవనం అలవాడాలన్నది బాబా ప్రబోధము.

1969లో మెహెర్‌బాబా శరీర పరిత్యాగం చేసినప్పుడు, ఆయన శిష్యురాలు మెహెరా ఈ ప్రపంచమే నశించినట్లు పరితపించింది. రాత్రింపగళ్ళు మానవ మేధస్సుకు అంతుచిక్కని ఆవేదనతో తన ప్రియతముని కోసం చింతిస్తూ బాధపడింది. ఆ తర్వాత దాదాపు 20 ఏళ్ళ పాటు తనలో ఆసీనమై ఉన్న అత్యున్నత వైజ్ఞానిక నిర్లిప్తత నుంచి తేరుకొని, ప్రియతముని ఇంటికి ప్రతిరోజూ వచ్చే అనేక మందికి స్వాగతం చెప్పడమే కాక, ప్రియతమునికి ప్రేమికునికి మధ్య ఉండవలసిన అనుబంధం గురించి వ్యక్తపరుస్తూ సేవలందించిన మహాసాధ్వి మెహెరా. ఆమె గురించి మెహెర్‌బాబా ఒకసారి ఇలా వ్యక్తపరిచారు- "నేను మెహెరాను నా కొరకు ప్రేమిస్తున్నాను. అయితే అదే సమయంలో నేను మిమ్ములనంచరనూ మీ కోసరం ప్రేమిస్తున్నాను" అన్నారు. దీని అర్థం ఏమిటి?

అవతారుడు భగవంతుడు. ఆయన అందరివాడు. సకల సృష్టిని సమ దృష్టితో ప్రేమిస్తాడు. అయినప్పటికీ మెహెరా యందున్న ప్రేమలోని వ్యత్యాసాన్ని ఎందుకు వ్యక్తపరిచారో తెలుపుతూ "నేను ఈ సకల సృష్టిని ప్రేమిస్తాను. ఎందుకంటే, నేను ఆ సృష్టితో పని చేయవలసిన అవసరం ఉన్నది. మిమ్ములను మీ కొరకు ప్రేమిస్తున్నానంటే, మీ లబ్ధి కోసరమే మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. ఈ మాయ నుంచి మిమ్ములను విముక్తులను చేయుటకే మిమ్మల్ని ప్రేమిస్తున్నాను" అని విశదీకరించారు.

సాధారణ మానవుడు తన ప్రకృతి పరమైన జీవితంలో ద్వంద్వ ద్వైవిధ్యం గల, సుఖదుఃఖమయమైన జీవితానికి అలవాటు పడిపోతాడు. ప్రతికూల కల్లోలాల ఘాతాలకు, దురదృష్టకర వైఫల్యాలకు, పరాజయాలకు తట్టుకోలేక అతని మనస్సు ఆ దెబ్బల నుంచి తప్పించుకోవాలని ప్రయత్నిస్తుంది. ఇందుకు పూర్తిగా భిన్నమైన సంతోషకర కల్లోలాలు, కీర్తి ప్రశంసలు సంప్రాప్తించినప్పుడు అతని మనస్సు ఆనందంతో పరవశించిపోతుంది. అయితే మనస్సుకు చెందిన ద్వంద్వాల వెనుక. జీవిత మాధుర్యంలో అంతరాత్మ పొందే ఆనందం స్థిరంగానే వుంటుంది. ఇక్కడ మనం ముఖ్యంగా గుర్తించవలసింది మనస్సు యొక్క ప్రవృత్తి.

ఈ మనస్సు మనకు తారసపడే ప్రతి అనుభవాన్ని రెండుగా విభజించి, కొన్నిటిని మంచిగా, మరికొన్నిటిని చెడ్డవిగా వేర్పాటు చేస్తుంది. ఆధ్యాత్మిక దృష్టిలో, యీ విభజన ఎలా జరగాలో బాబా చక్కగా వివరించారు. ఆయన వాంఛప్రకారం మనస్సు ప్రేరేపించే కోరికను తీర్చుకొనుటకు చేసే ప్రతి పనిని, ప్రతి అనుభవాన్ని చెడ్డదిగానే పరిగణించాలి. అదే విధంగా మనస్సును ఆ కోరికల బంధం నుండి విముక్తి చేయగల అనుభవాన్ని చేసే పనిని మంచిదానిగా పరిగణించాలి. అంతే తప్ప నీ కోరికల్ని తీర్చే వాటిని మంచి వాటిగాను, కోరికల్ని తీర్చనివైతే చెడ్డవాటిగాను పరిగణించకూడదని బాబా అంటారు. ఇక్కడ మన సంస్కారాలే మనస్సుగా వ్యక్తమవుతాయి కనుక, మనకా మనసు పైె వచ్చే ప్రతి

కోరికకు అనుగుణ్యంగా దీనిని కార్యరూపంలో పెట్టాలా వద్దా? అని నిర్ణయించుకొనే స్వేచ్ఛ మనకున్నది.

అందువల్ల ప్రియతమ బాబా అందించిన జ్ఞానము ద్వారా దానిని పరిశీంచి పరిత్యజించాలి, అదే విధంగా మనకు ఎదురయ్యే అనుభవాలన్నీ మనము పోగుచేసుకున్న సంస్కారాలను బట్టే సంప్రాప్తిస్తాయి. లాభ నష్టాలు, గౌరవాగౌరవాలు, మంచి చెడులు ఆ ద్వంద్వాలన్నీ మన సంస్కారాల బట్టి వాటంతటవే ఖర్చుచేయబడుటకు, అనుభవాల రూపంలో మనకు తారసపడతాయి. వాటినుంచి తప్పించుకొనే స్వేచ్ఛ మనకు లేదు. మనకు అనుకూలంగా ఉన్న అనుభవాలను ఆనందంతో అంగీకరిస్తాం. ప్రతికూలమైన అనుభవాల్ని ఎదుర్కొన్నప్పుడు, అయ్యో! నేను నష్టపోయాననో, నా పరువు పోయిందనో, నా ఆరోగ్యం పాడయిందనో. పరి పరి విధాల దుఃఖపడతాము. ఈ ఆవేదనతో అందుకు కారకులైన వారిపై పగను, ఈర్ష్యను, ద్వేషాన్ని పెంచుకొని, నిందించటమే కాక, ప్రతీకార చర్యకు సైతం పూనుకుంటాము. న్యాయానికి ముద్రలన్నీ సరికొత్త సంస్కారాల రూపంలో మన చైతన్యముపై స్థిరముద్ర వేసుకొని మరుజన్మకు పునాది రాళ్ళవుతున్నాయని తెలుసుకోలేకపోతున్నాం. అందుకే బాబా "మీకు ఏది సంప్రాప్తించినా దానిని భగవదేచ్ఛగా స్వీకరించి, నిర్లిప్తతతో అనుభవించిన నాడు అటువంటి సంస్కారము ఖర్చు కావడమే కాక, సరికొత్త సంస్కారము రాకుండా చేస్తుంది" అన్నారు.

యుగావతారుడుగా మెహెర్‌బాబా తన దివ్య ప్రవచనములు ద్వారా మానవుని మానసిక ప్రవృత్తినే సంపూర్ణంగా మార్చివేసి, ఆధునిక మానవ చరిత్రలో ఒక నూతన అధ్యాయాన్ని ప్రతిష్టించారు. ఆయన నిర్వహించిన కార్యక్రమము అంతర్గతమైనది. తన కార్యక్రమం అన్నిటి కంటే అతి రహస్యమైనదని బాబాయే స్వయంగా ప్రకటించారు. దాని విధానాన్ని అవగాహన చేసుకోవటం మహాత్ములకు సైతం సాధ్యం కాదట. భగవంతుడు చెప్పే విషయాల్ని మానవ మేధస్సు అంత సులభంగా అర్థం చేసుకోలేదు. సర్వ జ్ఞానానికి మూలం దైవము. జ్ఞానమే తానైన దైవము

మెహెర్‌బాబా రూపంలో అవతరించాడు. ఆయన నిర్వహించిన కార్య క్రమం ద్వారా సర్వబాహ్యంతర ప్రకాశాలతో మన బుద్ధిని ప్రేరేపించి, తన దైవ స్వరూపాన్ని వెల్లడించుటకు, ఆయన గడిపిన జీవితాన్ని ఒక అవకాశంగా ఉపయోగించుకున్నాడు. తానే దైవాన్నని బహిరంగంగా చెప్పుట ద్వారా కర్మబద్ధుడు కాని కర్మయోగిగా మనలను తీర్చి దిద్దుటకు భూమికను సిద్ధపరిచారు. అవతార సిద్ధాంతాన్ని సంగ్రహంగా ఆకళింపు చేసుకొంటేనే మెహెర్ అవతార తత్వం విశదమవుతుంది. కేవలం వేదాంత దృష్టిలో పరామర్శిస్తే దివ్య జన్మ రహస్యం అవగతం కాదు.

"నేనా దివ్యసనాతనుడను. నేనే రాముడను, కృష్ణుడను, బుద్ధుడను, క్రీస్తును మహమ్మదును. ఇప్పుడు మెహెర్‌బాబాగా వచ్చాను" అని బహిరం గంగా వ్యక్తం చేసిన మెహెర్‌బాబా బాహ్య ప్రకటన యొక్క ప్రాముఖ్య తను గురించి ఆ అవతారతత్వాన్ని గురించి మరింత నిశితంగా పరిశీలించి, ఆయన ప్రకటనలను, సత్య ప్రేమ సందేశాలను క్షుణ్ణంగా ఆకళింపు చేసు కుంటేనే మెహెర్ అవతార ప్రయోజనము విశదమవుతుంది. "నేను జనన మరణములకు అతీతుడను." "సకల సృష్టి నా వల్లనే ఉద్భవించినది" "దైవమైన నా నుండి సకల మానవాళి. యావత్తు జగత్తు పుట్టుకను ప్రారం భించినది నేనే" "ప్రేమించాలన్నా, ప్రేమించనక్కర్లేదన్నా, ఉండేది నేనే." "నన్ను ప్రేమించని వారిని సైతం ప్రేమించేది నేనే" అంటూ తన దివ్యత్వాన్ని సర్మగర్భంగా వ్యక్తపరచారు. తన అద్వితీయ తత్వ రహస్యాన్ని వెల్లడించి మనల్ని ఏం చేయమంటున్నారు? "మీ దివ్య ప్రియతమునితో సమైక్యమయ్యే వరకు, ఆ ప్రియతముని కొరకు తితీక్షతో పరితపించండి" అంటున్నారు.

"ప్రియతముని ఇచ్ఛకు ప్రేమ సర్వార్పణవుతుంది. తన సమస్తాన్ని తన ప్రియతమునికి అర్పించుకుంటుంది. తన సర్వస్వాన్ని ప్రియతమునికి త్యాగం చేస్తుంది. ప్రియతమునికొరకే జీవిస్తుంది. ప్రియత ముని కొరకే మరణిస్తుంది. ప్రేమ యొక్క యీ అత్యుత్తమ స్థితి. దివ్యత్వ స్థితి. అందుకే ప్రేమ అంటే దైవమూకాక, మరేమిటవుతుంది?

ప్రేమ అనంతమైనది, శాశ్వతమైనది. అధమాత్మను ప్రేమ నాశనం చేసి ఉన్నతాత్మను వ్యక్తపరుస్తుంది. ప్రేమే దైవత్వము. జీవించుట ప్రేమించుటకే, ప్రేమ లేకుండా మీరు యధార్థంగా జీవించలేరు. అగోచరమైన ప్రకృతిపర చట్టమునకు, తన దివ్యత్వపు శక్తిని జగత్తంతా వ్యాపింపచేసే అద్భుత శక్తి ఉన్నది. సాహసవంతులు, ధైర్యోపేతులైన వీర హృదయాలకే యీ ప్రేమను ఆస్వాదించే అదృష్టం లభిస్తోంది. ప్రేమ అనేది ప్రాణాల్ని నిలిపే జలధార. ఏ ఒక్కరూ ప్రేమ లేకుండా మనలేరు. అల్ప విషయాలు మీ శక్తిని ఆలోచనల్ని, కాలాన్ని వృథా చేస్తాయి. కనుక వాటిని గురించి పట్టించుకోకండి. ఆప్యాయంగా ప్రేమించి మరచిపోండి. నా ఇచ్ఛకు, నా కృపకు పాత్రులై నాతో సమత్వాన్ని పొందుటకు ఇది ఒక్కటే సరైన మార్గం. ఓర్పు, సహనాన్ని అలవర్చుకున్నవారు ఆధ్యాత్మిక మార్గంలో సులభంగా ప్రవేశించకలుగుతారు." ఇవి బాబా సందేశాల్లో కొన్ని మచ్చు తునకలు.

ఇక్కడ ఒక అతి ముఖ్య సూత్రము వున్నది. జ్ఞానం పొందాలంటే గురుకృప తప్పనిసరి. ప్రేమ ఒక్కటే అట్టి గురుకృపకు ఏకైక సాధనం, జ్ఞానం ఎందుకు కావాలి? అసలు జ్ఞానం అంటే ఏమిటి? విషయలోలుడైన మానవుడు, ఇంద్రియ విషయాల్లో ఆసక్తిని కోల్పోయి, అహంకార నాశనం జరగటం వల్ల అట్టి, జ్ఞానాన్ని పొందుకలుగుతున్నాడు. జరామరణాల శాపం నుంచి విముక్తిని సాధించి, ఆత్మ నిగ్రహాన్ని పొందినవాడు జ్ఞాని. "నన్నే స్మరించి, నన్నే ప్రేమించి, నన్నే సేవించువారు నా వారు. వారికి నేనెప్పుడూ సహాయపడతాను" అని బాబా అభయాన్నిస్తున్నారు. అంటే దానర్థం విచక్షణారహితంగా కనిపించిన వారినల్లా ముందూ వెనుకా లేకుండా ఆదుకుంటారని కాదు మనం గ్రహించాల్సింది, ఆయన ఇచ్ఛకు పాత్రులు కావాలంటే కొన్ని అర్హతలున్నాయి.

అశాశ్వతము, సుఖ హీనమైన ఈ లోకంలో జీవన సమరం సాగించే ఆత్మ, పై విధంగా వినిపించే దైవ పిలుపులను ఆకళింపు చేసుకొనుటలో మానసిక సంఘర్షణ జరిగి, అట్టి ఆధ్యాత్మిక మదనంలో

అంతిమ విజయాన్ని సాధించి, ప్రకృతికి, ప్రపంచానికి అతీతంగా ఉండేట్లు సహాయపడుతుంది. ఈ క్రియలో ప్రధాన భూమిక ఉదాసీనతది. ఆధ్యాత్మిక శిక్షణలో ఉదాసీనస్థితి చాలా అవసరమైన అంశం. ఒక మహా ప్రయత్నానికి ప్రథమ సోపానం. ప్రకృతికి సంబంధించిన బలహీనతలకు అంతరాత్మ లొంగిపోకుండా ఆత్మ నిగ్రహం ఉండాలంటే ఈ ఉదాసీనం లేదా లేదా నిర్లిప్తత కీలకపాత్ర వహిస్తుంది. రాగద్వేషాల నుండి విముక్తిని సాధించిన ఇంద్రియాలు విషయాలపై ప్రవర్తిస్తున్నా, ఆత్మకు వశమై నిశ్చలత్వాన్ని పొందుతాయి. సుఖదుఃఖాల రెంటి మధ్య మనస్సు చలించకుండా ఉన్నపుడే రాగద్వేషాలు, కామక్రోధాలు తొలగిపోయి స్థిత ప్రజ్ఞులవుతారు. తాత్విక దృష్టిని అలవర్చి ఇటువంటి స్థిరమైన ప్రజ్ఞను ప్రసాదించుటే బాబా చేసిన అంతరంగ కార్యక్రమం స్వతంత్ర జీవనంసాగించే మనకు బాబా ఆదేశాల్ని విధేయతతో పాటించుట అంత సులభం కాదు. నిజానికవన్నీ బాబావి కనుక, వేరేవరివి కానందునే అవి విధేయతకు పరీక్షలవుతున్నాయి. ఒకవేళ వాటిని పాటించాలన్నా, మన మధ్య అనసర అపార్థాలకు దారితీసి పొరపాటులను రేకెత్తించే వీలుంది. ఇక్కడ మనం గమవించాల్సింది మనలోని అహాన్ని తుడిచివేయటమే. బాబా నిర్వహించిన వని అని. సమస్య లెదురైనప్పుడు వితండ వాదానికి దిగకుండా మౌనం వహించుటను అలవర్చుకోవటం చాలా ముఖ్యం. కనుక మనమలా నడుచుకోగలిగితే, వ్యక్తులపై బాబా నిర్వహించే కార్యక్రమానికి మనమెంతో సహకరించిన వారమవుతాం.

మనలో ప్రతి ఒక్కరి కొరకు బాబా నిర్వహించిన ముఖ్య మంత్రాంగమంతా, మనము ఆయన్నెలా ప్రేమించాలో ఆచరణాత్మకంగా చూపుటకు ఉపయోగపడుతుంది. అన్నిటికంటే ముఖ్యంగా ఆ ఏకైకునితో సహజీవనాన్ని సమత్వభావంతో గడిపే అదృష్టం, ఆయనకు సమకాలికులుగా పుట్టుట వల్ల మనకు లభించింది. ఆయన్నే ఒక ఉదాహరణగా తీసుకొని, ఆ బోధల్ని సక్రమంగా నేర్చుకోలేనప్పుడు, ఆయనే స్వయంగా కల్పించుకొని, తనను ప్రేమించే ప్రేమికుల్ని సరైన మార్గంలో ఉంచిన ఘట్టాలెన్నో ఉన్నాయి. అందుకాయన ఉపయోగించిన అస్త్రం ప్రేమ.

ప్రేమ జగత్తులో అంతటా వ్యాపించి ఉంటుంది. సృష్టిలోని నిర్జీవ పదార్థాల్లో ప్రేమ స్పందన కేవలం ఆకర్షితమే అయినా నిండివుంటుంది. మానవునిలో సహజ సిద్ధంగా ఉండే ప్రేమ పరిణామ క్రమంలో పెరిగి పోషించబడి యదార్థ ప్రేమగా మారుతుంది. ఎవరైతే దివ్య ప్రేమామృతాన్ని తనివి తీరా తాగాలని కోరుకుంటారో అటువంటివారు దానిని గురువు ద్వారా మాత్రమే పొందగలుగుతారు. దైవ ప్రేమ అత్యున్నతమైనది. ఇది మౌనంగా ఉండదు. దానికి అతిదారుణమైన తపన ఉంటుంది. అవతారుడి కృపవల్ల ఇటువంటి దివ్యప్రేమను ఆస్వాదించిన మహాసాధ్వి మెహెరా మనకు ఆదర్శప్రాయురాలు కావాలి.

ధర్మం, అధర్మం, మధ్య నిరంతర పోరాటం, నిత్య సంఘర్షణలు జరుగుట వల్ల, జయాపజయాలు రెండువైపులా ఉండే అవకాశం ఉన్నది. ధర్మం అంటే కేవలం, వర్ణాశ్రమ కర్మానుష్టానమునకు సంబంధించినది మాత్రమే కాదు. నైతిక నియమానుష్ఠానం కూడ ఇందులో ఒక భాగం, ఈ అర్ధంలోనే "ఎప్పుడు ఋజువర్తన నశించి, అన్యాయము, అణచివేత విజృంభిస్తుందో అప్పుడు భగవదవతరణ జరిగి, దుష్ట శిక్షణ, శిష్టరక్షణ జరిపి, న్యాయం నెలకొల్పబడి మానవ జాతిలో నైతిక సమతుల్యత పునః ప్రతిష్ఠ చేయబడుతుంద"న్నది అవతారుడిగా దైవం నిర్వహించే విశ్వ కార్యక్రమం ఆచరణాత్మకమైన, సాంఘిక రాజకీయ రంగాల్లో ఆధ్యాత్మికంగానూ గణనీయమైన పరివర్తన జరుగుటకు దోహదపడుతుందని స్పష్టమవుతుంది.

భగవదతవతరణ రెండు విధాలుగా జరుతుంది. దివ్యశక్తితో దివ్య వ్యక్తిత్వం కలిగిన దివ్య జీవితాన్ని గడిపే అవతరణ ఒకరకం. (రామ, కృష్ణ అవతరాలు ఈ కోవకు చెందుతాయి) అలాకాక, భగవంతుడు ఒక పరిపూర్ణ గురువుగా, రక్షకుడుగా దిగిరావటం జరుగుతుంది. బుద్ధుడు క్రీస్తు మహమ్మదులీ కోవకు చెందిన అవతారాలు. ఏ అవతారుడైనా నిర్వహించేది అధ్యాత్మిక కార్యక్రనుమే. అయినప్పటికీ, వారు నిర్వహించిన కార్యక్రమపు ప్రభావము వారితోనే ఆగిపోకుండా ఎల్ల కాలాల్లో

మానవాళి బాహ్య జీవితంపై ఎనలేని ప్రభావాన్ని చూపిస్తున్నదంటే కాల క్రమంలో బాహ్య జీవితంపై వారు నిర్వహించిన కార్యక్రమ ప్రభావం ఎంతగా ఉన్నదో నిశదమవుతుంది. జాతి అంతరాత్మలో ఆయా అవ తారాలు నిర్వహించిన విశ్వకార్యక్రమం, అంతర్గత జీవితానికీ, అధ్యా త్మిక పునర్జన్మకు శాశ్వత శక్తిగా ఉపయోగపడుతోంది.

ఇక్కడ మనం గుర్తుంచుకోవలసిన దేమంటే భగవంతుడు అధ్యా త్మిక ప్రయోజనం కోసరము అవతరించినా, బాహ్యంగా కూడా ఆయన ద్వారా మార్పులు జరుగుతాయన్నది సత్యము.

బాహ్య ప్రయోజనం కోసరం అవతరించిన అవతారుడు అంత రంగంలో మార్పులు తెచ్చినా, ఆధ్యాత్మిక పునర్జన్మకు సహాయపడతాడు. ఆధ్యాత్మిక ప్రయోజనం కొరకు అవతరించిన అవతారుడు బాహ్యంగా కూడా మార్పులు తెస్తాడు. అవతారుడి జీవితంలో బాహ్యకర్మతో పాటు అంతరంగ ఆధ్యాత్మికత కూడా కలబోసి, కనపించిన అద్భుత అవ తారం, మెహెర్ అవతారం మెహెర్‌బాబా గడిపిన జీవితం, ఆయన నిర్వ హించిన విశ్వకార్యక్రమంలో ఈ రెంటి ప్రయోజనాలు స్పష్టంగా కనిపి స్తాయి. మతపరమైన ఆధ్యాత్మిక సత్యాలు నైతిక, సామాజిక రంగాల్లో పాతుకుపోయి, మానవతావాదం క్రింద రూపాంతరం చెందాయి. ఈ అణు యుగంలో, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వాలకై పోరాడే మన స్తత్వం పెరిగి సాంఘిక, రాజకీయ రంగాలు కలుషితమైపోయాయి.

అందుకే దుష్టశిక్షణ, శిష్టరక్షణ వంటి బాహ్య లక్ష్యసాధనకు అనువైన అవతారుని రాక అవసరమైనది. శాస్త్రవిజ్ఞానాన్ని అపారంగా సాధించిన మానవుడు ఆధ్యాత్మిక సత్యాన్ని విస్మరించి తాను సాధించిన వైజ్ఞానిక రహస్యాల ప్రభావానికి పూర్తిగా లొంగిపోవుట వల్ల, ఈ ఆధునిక మానవునిలో ఆధ్యాత్మిక మేలుకొలుపు గావించుట కూడా తప్పనిసరైంది. ఈ రెండు బాధ్యతలను ఏకకాలంలో నిర్వహించుటకు ప్రేమమయుడైన భగవంతుడు, మెహెర్ అవతారుడిగా అవతరించాడు. ఆయన గడిపిన జీవితంలో అవతారుడి పాత్రను చక్కగా అవగతమయ్యేటట్లు పోషించారు.

అవతారము అనేది దివ్యచైతన్యమునకు చెందినదే తప్ప, కేవలం బాహ్య కర్మలకు మాత్రమే కట్టుబడి ఉన్నది కాదని ఋజువు పరచారు. ఆయన జీవితంలో జరిగిన ప్రతి బాహ్యకర్మ కూడా బ్రహ్మాండమైన అధ్యాత్మిక ప్రభావాన్ని కలిగి, ఆ కర్మలు ముగిసిపోయిన తరువాత అవి ఒక ఉపదేశంగా ఎందరికో అధ్యాత్మిక మేల్కొలుపునిస్తున్నాయంటే బాబా గడిపిన బాహ్యజీవితం మానవాళికి అనన్యమైన శాశ్వత ఫలితాన్నిస్తున్నాయన్న మాట. బాబా శరీర త్యాగానంతరం సైతం, ఈ శాశ్వత ఫలిత ప్రభావం, మానవజాతి ఆలోచనలో స్వభావంలో కూడా ప్రతిఫలించే ప్రేరణను రేకెత్తిస్తోంది.

రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు మహమ్మదులు గత అవతార నామములు, వేలాది సంవత్సరాల క్రితం ఆయా కాలాల్లో ఏకైకుడైన పరమాత్మ భిన్ననామాలు విభిన్న రూపాల్లో పలుప్రాంతాల్లో అవతరించుట జరిగింది. "నేను దివ్య సనాతుడను....పురాణ పురుషుడను"...."నేనే రాముడను, కృష్ణుడను, బుద్ధుడను, క్రీస్తును, మహమ్మదును. ఇప్పుడు మెహెర్‌బాబాగా వచ్చాను" అంటూ మెహెర్‌బాబా తన అవతార విశిష్ఠతను విస్పష్టంగా ప్రకటించారు. ఇక్కడ మనం గమనించాల్సినది ఒకటున్నది. గత అవతారులందరు కూడా ఆయా అవతార కాలాల్లో, ఆ కాలానికి ఆ అవతారుడే ప్రత్యక్ష దైవం. రాముడి కాలంలో రాముడే అవతారుడు. కృష్ణుడి కాలంలో కృష్ణుడే అవతారుడు అవుతాడు కాని, గత కాలపు రాముడు కాబోడు. రాముడి అవతార విశిష్ఠత కృష్ణుని కాలంలో పాతబడి పోయింది. అప్పటి అధునాతన అవతారము కృష్ణుడు. అలాగే జొరాష్టరు, బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదులే కాదు ఇప్పటివరకూ అవతరించిన (మెహెర్‌బాబా పేర్కొన్న 5328) అందరు అవతారుల కాలాల్లో కూడా ఆయా కాలాల్లో వుండే అవతారులదే విశిష్ఠత. అంతేకాని తమకు ముందు వున్న అవతారులకు ఉండదు.

ఆ సమయంలో ఉండే అవతారుని కార్యక్రమపు విశిష్ఠత ప్రకారం, ఆయన శరీరత్యాగం చేసిన నూరేళ్ళ వరకూ పరిఢ విల్లుతుంది. ఆ

తర్వాత 700 లేదా 1400 ఏళ్ళకు మళ్ళీ వచ్చే అవతారకాలము వరకూ, ఈ అవతారుని శక్తి మానవాళిపై పనిచేస్తుంది. ఆ పిమ్మట మళ్ళీ వచ్చే అవతారుడి పేర కొత్త పుంతల్లో నవీన అవతారుని కార్యక్రమం కొనసాగు తుంది. ఆధ్యాత్మిక దృష్టిలో దీనికెంతో ప్రాముఖ్యత ఉన్నది. ఆధ్యాత్మిక గురుపీఠంలో యీ సత్యమునకు అత్యంత ప్రాధాన్యత ఉన్నది. ఈనాటి నవీన అవతారుడు అవతార్ మెహెర్‌బాబా యుగకాలంలో మనమంతా సమకాలికులుగా ఉన్నాము. తన కొంగును జారవిడువక, గట్టిగా పట్టు కున్నవారు కోరుకున్నది పొందుతారని బాబా అభయమిచ్చారు, బాహ్యంగా గాని, ఆధ్యాత్మికంగా గాని, ఏది కోరుకున్నా పొందే అదృష్టం, అచంచల మైన విశ్వాసం, సర్వార్పణాభావం, అనితర విధేయతలు ఉంటేనే సాధ్య మవుతుంది.

కొడిగట్టిన ధర్మజ్యోతిని పునఃప్రజ్వలన చేయగల శక్తి మహాత్ము లకు, విభూతులకు ఉండదు కనుకనే భగవంతుడు స్వయంగా దిగివచ్చి ఆ కార్యభారాన్ని నెరవేర్చవలసి ఉన్నందున నిరంతరం రణగొణ ధ్వనుల మధ్య, యాంత్రిక జీవితం గడుపుతూ, అపార శాస్త్ర విజ్ఞానంతో విర్రవీగుతున్న నవీన మానవుడి విషాదాంతానికి విరుగుడు ప్రసాదించేందుకు ప్రేమమూర్తిగా, ఆధునిక అవతారుడై మెహెర్ బాబా రూపంలో భగ వంతుడు అవతరించాడు. మాటలతో పనిలేని చేతలద్వారా తన విశ్వకార్య క్రమాన్ని మెహెర్ బాబా నిర్వహించారు. 45 ఏళ్ళపాటు తన అఖండ మౌనాన్ని కొనసాగించి, మౌనంలోనే దేశ విదేశీ పర్యటనలు జరిపి, ఎన్నెన్నో విశ్వసందేశాలందించారు. ఆయన నెలపిన విశ్వకార్యక్రమ ప్రభావంవల్ల, నైతిక, సాంఘిక, మత నియమాలతో కొట్టుమిట్టాడుతున్న సమాజంలో ప్రేమ బీజం నాటబడి, ఏకత్వ భావన పాదుకొల్పబడింది. ప్రేమారాధన ద్వారా మాత్రమే దైవాన్ని అన్వేషించాలే తప్ప అందుకు క్రతువులు కర్మకాండలు దోహదపడవని ఆచరణాత్మకంగా మేల్కొ ల్పారు.

ఎందరో మహనీయుల ఉపదేశములు వారందించిన శిక్షణలకన్నా,

మెహెర్‌బాబా ప్రవచించిన ఉపదేశాలు, విశ్వజనీనమై ఏకత్వాన్ని ప్రబోధించి, సర్వమానవ సంబంధాల్ని ఒక ఉన్నత స్థాయికి తీసుకువచ్చాయి. ప్రతి అవతార యుగంలోను, ఆ కాలపు అవతారపురుషుడు ఒక నవీన ధర్మాన్ని ప్రసాదిస్తాడు. దాని ఫలితంగా మానవుడు నిమ్న జీవితమునుండి అత్యున్నత జీవితంలోనికి ప్రవేశించ కలిగి సర్వాన్ని తనలో ఇముడ్చుకొనే వేదాంత ఏకత్వ భావనను అలవరుచుకుంటాడు. అంతరాత్మ సర్వాన్ని తనలోను, తనను సర్వంలోను చూచి, సర్వజీవులతోను ఒకటి అవుతుంది. దైవాన్ని ప్రేమారాధన ద్వారా మాత్రమే ఆరాధించి సాక్షాత్కారం చేసుకోవచ్చున్నది బాబా సందేశం. మెహెర్‌బాబా యొక్క నామంలో, ఆయన దివ్య మంగళరూపంలో అవతార మూర్తి అభివ్యక్తమైనప్పటికీ, మానవుల దృష్టి, ఆ బాహ్యరూపం పైన నామంపైన కాక, ఆ నామరూపములు ప్రతినిధులుగా ఉన్న ఆ పురుషోత్తముని పైనే లగ్నం కావాలని బాబా నొక్కి చెప్పారు. మానవులు పూజించే దేవుని సకల నామములు, రూపాలూ ఆ దేవుని ప్రతిరూపాలే కనుక ఈ రూపమనేది పురుషోత్తమునికి ప్రతినిధి అవుతోంది. మెహెర్‌బాబా ప్రకటించిన ప్రేమ మార్గము, నిజమైన జ్ఞానాన్ని, నిజమైన ముక్తిని పొందగలిగే ఏకైక మార్గము.

అవతారుడు అవతరించినంత మాత్రం చేత, ఆయన రాకవల్ల కలిగే అంతర్గత ఫలాల్ని సమస్త మానవాళి పొందలేరు. దివ్యజన్మ, దివ్యకర్మల యధార్థ తత్వాన్ని తెలుసుకోగలిగినవారు మాత్రమే దీనిని అనుభవించ కలుగుతారు. నిమ్న ప్రకృతిలో ఉంటూ నిమ్న జీవితాన్ని అనుభవించే సామాన్య మానవులు తమ చైతన్యంలో బాగా ఎదిగి అవతారుని శరణు జూచి, కర్మబంధముల నుండి విముక్తులై అజ్ఞాన బంధన లేని కర్మల్ని నిర్వహిస్తూ జీవించుటకు అవతారుడు నిర్వహించే పాత్ర అత్యంత ప్రధానమైనది. మానవ చైతన్యాన్ని తన దివ్య వ్యక్తిత్వంతో నింపి పరిమిత అహంకార వ్యక్తిత్వ స్థానంలో దివ్య వ్యక్తిత్వాన్ని నెలకొల్పి అమృతత్వాన్ని చేరేట్లు అవతారుడు చేస్తాడు. ఒక దివ్య వ్యక్తిగా దిగి వచ్చిన అవతారుడే అవతార్ మెహెర్ బాబా.

"అందరూ నా వెంటకు రండు" అంటూ విశ్వాత్మక పిలుపు నిచ్చి సకల జీవులకు ఒక కుదుపునిచ్చారు మెహెర్‌బాబా. అందుకే ఈనాడు ప్రపంచం నలుమూలలా ఎన్నెన్నో దేశ దేశాల ప్రజలు బాబాను చేరి, ఆశ్రయించారు. మత మౌఢ్యపు కోరల్లో చిక్కుకొని అల్లకల్లోలంతో కొట్టు మిట్టాడుతున్న మానవాళిలో ఎందరో అదృష్టవంతులు ఈనాడు ఆయన పిలుపుకు ప్రతిస్పందించి, మెహెర్‌బాబాను దైవంగా అంగీకరించి, ప్రేమిస్తూ, ఆ ప్రశాంత ఆనందంలో జీవిస్తున్నారు. ఒక సాధారణ వ్యక్తి యొక్క జీవితం భ్రాంతి జనకమైనది. అయితే అవతారుడి జీవితం అలా కాదు. ఆయన జీవితం సత్యమునందు ప్రతిష్టించబడుతుంది. అవతార మనేది దివ్య జీవితానికి సంబంధించిన సత్యము. కనుక, అట్టి అవతారం పరిసమాప్తమైన తర్వాత కూడా ఆయన నిర్వహించిన ఆధ్యాత్మిక కార్య క్రమపు ప్రభావం వంద లేదా రెండు వందల సంవత్సరాల వరకు తదు పరి అవతరణ కాలమును బట్టి కొనసాగుతుంది.

భగవంతుడు మాటిమాటికి అవతారములు ఎత్తి దివ్య జన్మ, దివ్య కర్మల విధానాల్ని తన ఉదాహరణ ద్వారా ప్రకటిస్తాడు. ఆయన గడిపిన జీవితమును ఉదాహరణగా తీసుకొని మానవుడు, ఉన్నత చైతన్యంలో దివ్యత్వాన్ని కలిగించే జన్మ వచ్చేవరకూ అందుకు అనువైన కర్మల నాచరించుటను తెలుసుకుంటాడు. ఎటువంటి కర్మలు మానవుని ఉన్నత స్థితికి చేరుస్తాయో ఎటువంటి కర్మలు మానవుని అధోగతికి తోసేస్తాయో ప్రబోధించుట, అవతార కార్యక్రమములో ఒక పథకం మెహెర్ బాబా తన అవతార కార్యక్రమం ద్వారా యాంత్రిక కర్మకాండలతో సతమత మవుతున్న మానవాళి మాయ యొక్క శూన్యత్వం తెలుసుకొనేట్లు చేయు టకు ఎంతో కృషి చేశారు. కర్మకాండలు, జపతపాలు, పూజలు వంటివేవీ ఆయన ప్రతిపాదించలేదు. క్రమశిక్షణ వంటి నియమాల్ని నిర్దేశించలేదు. నిజాయితీతో తనను ప్రేమించేవారికి, తన ఎడల విధేయులయ్యేట్లు జాగృ తిని కలిగించారు. మానవ హృదయ క్షేత్రంలో ప్రేమబీజాన్ని నాటి, ప్రేమ ద్వారా ఏకత్వ భావాన్ని అనుభవించేట్లు చేశారు.

తన ఉపదేశాలను తాను ఆచరించి, ఫలసిద్ధిని పొంది, మానవాళికి దైవాన్ని ఆదర్శంగా చూపి, జీవిత పరమావధిని ఎరుకపరచారు. తాను మౌనంలో ఉన్నా, మానవాళి అవసరాల్ని భౌతికంగానూ, ఆధ్యాత్మికం గానూ కూడా తీర్చిదిద్ది తన అవతార ప్రాశస్త్యమును విశదపరచారు. జ్ఞానమునకే ఆయన గురువైనందున, ఆయనకు మాట్లాడవలసిన అగత్యం రాలేదు. తన జీవిత కాలములో అత్యధిక భాగము, ఏకాంతవాసము, ఉప వాసములతోనే గడుపుతూ ఒక్క పలుకైనా పలుకకుండా సాధించిన అవ తార విజయము, అవతార్ మెహెర్‌బాబాని జగదోద్ధారకునిగా ప్రతిష్ఠించి, అన్ని మతస్థులలో అత్యధికులకు ఆరాధ్య గురుదేవుడయ్యేట్లు చేసింది. అవ్యక్తుడు, రూపరహితుడైన భగవంతుడు మెహెర్ అవతారుని దివ్య శరీరం ద్వారా వ్యక్తమైనందున, ఇప్పుడా రూపం ఆయన కృపకు పాత్రు లయిన ఎందరికో కన్పించి దర్శనమిచ్చుట జరుగుతోంది అంటే పరమ అనిర్వచనీయమైన దైవంగా మెహెర్‌బాబా విశిష్టత అవగతమవుతుంది.

గత అవతారులందరూ మానవాళిని ఐక్యపరచుటకే కృషి చేశారు. కానీ వారి అనుయాయులు మాత్రం సంకుచిత భావాలతో మతతత్వం కల్పించి మానవుల మధ్య ఐక్యతను భగ్నపరచారు. శాస్త్ర సాంకేతిక రంగాల్లో అపారజ్ఞాన సముపార్జనను సాధించినా, మానవుడు మాత్రం యుద్ధోన్మాద కారు చీకటిలో కొట్టుమిట్టాడుతూనే ఉన్నాడు. దీనికి కావల సిన విరుగుడు ధర్మోపన్యాసాలు కాదు, ప్రేమ కావాలి. దివ్య ప్రేమ ఈర్ష్యద్వేషాల్ని జయిస్తుంది కనుక అట్టి దివ్య ప్రేమను అందించి ప్రశాం తంగా ప్రేమయ జీవితాన్ని గడిపేట్లు తన ప్రేమికులను మెహెర్‌బాబా తీర్చిదిద్దారు. మానవుడిని భిన్నంగా తయారు చేయుటకు కాక, ప్రేమ మార్గంలో మానవుడిని మలిచేందుకే తాను వచ్చానని బాబా ప్రవచించారు. అవతారుడు వచ్చినప్పుడు ఎన్నో నీతులు బోధించటం, మానవాళి చేత వాటిని పాటింపచేయటం జరుగుతుంది. కానీ మానవులు ఎంత నిష్ఠగా వున్నా మాయపట్టులో చిక్కి దారి తప్పుతున్నారు, వారిని సరైనమార్గంలో పెట్టేందుకే భగవంతుడు మళ్ళీ మళ్ళీ వచ్చి, అవతార కార్యక్రమాన్ని కొనసాగించవలసి వస్తోంది.

ఒక అవతారకాలంలో ప్రవచించిన సూక్తులు, ఒక పరిమిత కాలం వరకే ఉపకరిస్తాయి. కాలక్రమేణా అవి క్షీణించి గ్రంథాలకే పరిమితమవుతాయి. మళ్ళీ అవే నీతులను భిన్న విధానంలో మానవాళికందించుటకు భగవంతుడు తన దివ్య లీలలో ఒక భాగంగా తీసుకొని, కొంతకాలంపాటు మానవుల మధ్య గడిపేందుకు తదుపరి అవతరణ తప్పనిసరి అవుతోంది. ఏ అవతార సమయంలోనైనప్పటికీ, ఆరంభలో బహుకొద్ది మంది అనుచరులే ఉంటారు. ఆ అవతారుడి పేరుమీద ఉన్న మతం, ఆయనకాలంలో ఉండదు. ఆయన అవతారం చాలించిన తర్వాతే మొలకెత్తుతుంది. కాలక్రమంలో ఆయన అనుచరుల సంఖ్య బాగా పెరిగి ఆయన తత్వాన్ని విశ్వశించే వారంతా ఒక కూటమిగా చేరి, ఆ అవతారుడు ప్రవచించిన సత్యాలను, సూక్తులను గౌరవిస్తూ దానికే మతమని పేరు పెడతారు. మతమనేది మానవుడు సృష్టించిందే కాని దానికి అవతరణకు ఎటువంటి సంబంధము లేదు.

అవతారుడనని మెహెర్‌బాబా తనకు తానే ప్రకటించుకున్నారు. అలా ఎందుకు ప్రకటించుకున్నారో వివరిస్తూ మెహెర్‌బాబా "నేను అవతారుడనని నాకు నేనే ప్రకటించినప్పుడు బహు కొద్దిమంది సంతోషించారు కొందరు విస్మయం చెందారు, మరి కొందరు నా ప్రకటనను విని నన్నొక వంచకునిగా, మోసకారిగా, అహంభావిగా లేదా ఒక పిచ్చివానిగా భావించారు" అంటూనే సత్యాన్ని విస్మరించరాదని హెచ్చరించారు. తాను అవతారుడనని ప్రకటించుటలో ఇమిడియున్న అసలు సత్యాన్నిలా వివరించారు :

"నిజమైన గొప్పవ్యక్తి, తనను గురించిన గొప్పతనాన్ని యధార్ధంగా తెలుసుకున్నప్పుడు, తన గొప్పతనాన్ని విస్మరిస్తే అది నిస్సందేహంగా తనకు తాను చిన్నబుచ్చుకోవటమే అవుతుంది. ఆ రూపానికి వినయం ఆధారము. నిజమైన గొప్పతనం దైవదూషణకు అతీతమైనది. అందరికంటే గొప్పవాడు, "నేను గొప్పవాడిని" అని చెప్పినప్పుడు అది ఒక అమోఘమైన సత్యము యొక్క అనిధారా వ్యక్తీకరణమవుతుంది."

మెహెర్‌బాబా తననొక అవతారపురుషుడిగా అంగీకరించమని శాసించలేదు. తన స్థితిని యాంత్రికంగా అంగీకరించమని ఎన్నడూ ఆశించలేదు. తమ గురువుయొక్క విశ్వసనీయతలను పరీక్షించుకొన్న తరువాతే అనుసరించే హక్కు ప్రజలకున్నదని బాబా చెప్పారు.

మెహెర్‌బాబా తలిదండ్రుల మాతృభూమి ఇరాన్. రచయితలకు, రాజులకు, గూఢమత వాదులకు నిలయం ఇరాన్ దేశం. సనాతన పర్షియన్ మతమైన జోరాష్ట్రియన్ మతావలంబకులైన అల్పసంఖ్యాక వర్గానికి చెందిన ఇరానీ కుటుంబాలు ఆ రోజుల్లో నీచంగా పీడించబడేవి. అలా అణగదొక్కబడిన కుటుంబాలకు చెందిన ఒక కుటుంబంలో మెహెర్‌బాబా తండ్రి షెరియార్ ముండేగర్ ఇరానీ జన్మించాడు.

ఇరాన్‌లోని ఖుర్రంషాహి అనే ఊళ్ళో షెరియార్ తండ్రి ముండేగర్ జోరాష్ట్రియన్‌ల స్మశాన భవనానికి కాపలాదారుగా ఉండేవాడు. తండ్రికి సహాయపడుతూ 12 ఏళ్ళ చిరుప్రాయంలోనే షెరియార్ దైవాన్వేషణలో మణిగిపోయాడు. ఫలితంగా ఇల్లు వదిలి దేశమంతా తిరిగి దైవాన్వేషణలో ఎన్నెన్నో ఇడుమల నెదుర్కొంటూ 30 సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ ఇరాన్, ఇండియా దేశాలు కలియ తిరిగాడు. కఠినమైన నిష్ఠలను ఆచరించాడు. సూఫీల సాంగత్యం చేశాడు. ఎన్ని నియమాలను పాటించినా స్వల్ప విజయాన్ని సైతం సాధించలేకపోయేసరికి నిరుత్సాహపడి నిద్రాహారాలుమాని, ఒక నది ఒడ్డున అన్ని ఆశలు వదులుకొని ఏకాంతంగా కూర్చున్నప్పుడు అశరీరవాణి మాటల్ని విన్నాడు.

"నీవు ఎవరిని కోరుతున్నావో, నీవు ఎవరినైతే చూడాలని తపిస్తున్నావో, ఆయన్ని సంపాదించుట నీకు ఉద్దేశించబడలేదు. నీ కుమారుడు, దానిని నీ కుమారుడు పొందుతాడు. మరి నీ కుమారుని ద్వారా నీవు పొందుగలవు"

పై సందేశం విన్న తరువాత షెరియార్ బొంబాయిలో వున్న తన సోదరిని కలియుట జరిగింది. ఆమె ప్రోద్బలంతో పూనాలో స్థిర నివాస

మేర్పరచుకొని, వయస్సులో తనకంటే చాల చిన్నదైన షిరీన్ అనే బాలికను వివాహమాడాడు.

ఆ దంపతులకు రెండవ సంతానంగా మెహెర్‌బాబా జనన మొందారు. తల్లిదండ్రులాయనకు మేర్వాన్ అని నామకరణం చేశారు. పర్షియన్ భాషలో మేర్వాన్ అంటే "సూర్యునివంటి వాడు" అని అర్థం. ఆయన పుట్టుకముందే తల్లి షిరీన్ ఎన్నో అద్భుత అనుభవాల్ని పొందింది. ఒక దేవత వారింటిదొడ్లో వున్న నూతినుంచి పైకి వచ్చి తన ముద్దుబిడ్డడిని పూజించి తనకు వప్పగించమని వత్తిడి చేసినట్లు కలగన్నది. అశేష ప్రజానీకం తన కుమారుడ్ని సందర్శించుటకు బారులు తీరినట్లు ఒకసారి, దివ్యతేజస్సుతో వెలిగిపోతున్న ఒక మహనీయుడ్ని రధంలో కూర్చోపెట్టి జనం బారులుదీరి ఊరేగిస్తున్నట్టు మరోసారి ఇలా ఎన్నో కలలుకన్న షిరీన్‌మాయి, 25 ఫిబ్రవరి 1894 ఉదయం 5-00 లకు పూనా సనూన్ ఆసుపత్రిలో మేర్వాన్‌కు జన్మనిచ్చింది. పసి బాలుడి అందానికి అబ్బుర పడి చాలామంది ఆకర్షితులై రోజూ విశేష సంఖ్యలో అతడ్ని చూచుటకు వారింటికి వచ్చేవారు.

మేర్వాన్ చిన్నతనంలో ఎన్నో అసాధారణ సంఘటనలు చోటు చేసుకున్నాయి. చదువులో అందరికంటే మేటిగా ఆటపాటల్లో నాయకత్వ లక్షణాల్ని ప్రదర్శించి ఉపాధ్యాయుల మన్ననలను పొందేవాడు.

మేర్వాన్ తనకు 16 ఏళ్ళ వయస్సప్పుడు పూనాలో కాస్మాపాలిటన్ క్లబ్‌ను స్థాపించాడు. "అందరినీ ప్రేమించు, సోదర భావాన్ని పాటించు, ఏకత్వభావాన్ని ఆచరించు" అనేవి యీ క్లబ్ యొక్క ధ్యేయం. హీన మైన మిశ్రమ కులాల జాతుల సముద్ధరణకై ధనాన్ని సేకరించి అనేక కార్యక్రమాలు నిర్వహించుట జరిగింది. ఆధ్యాత్మికతను ప్రేరేపించే రచన లను "హోసూ" అనే కలం పేరుతో వ్రాసేవాడు. అలా మేర్వాన్ వ్రాసిన అనేక రచనలు వార్తాపత్రికలలో ప్రచురితమయ్యాయి.

ఇంతకుముందే మనం చెప్పుకున్నట్లు, సర్వకాల సర్వావస్థలయందు యీ భూమిపై ఆధ్యాత్మిక గురుపీఠం పనిచేస్తూ ఉంటుంది. మానవాళిని

ఆధ్యాత్మికోన్ముఖులుగా చేయుట వారి విధి. విషయ వాంఛలకు, ఇంద్రియ భోగాలకు లోనైన మానవుడి స్వార్థంతో తరుమబడి ప్రపంచ కల్లోలానికి దారి తీసినప్పుడు, విశ్వాత్మకస్థాయిలో మానవాళియొక్క ఆధ్యాత్మిక పునరుజ్జీవనపు పిలుపు వచ్చి, ఆ కాలంలో వున్న పంచ సద్గురువులు కలసి రూప రహితుడైన అనంతుడిని, దైవ మానవుడిగా రూపుదాల్చి అవతరించేట్లు చేస్తారు. ఆయన తల్లిదండ్రుల్ని ముందుగా వీరే ఎంచుకొని, ఆయన జననానికి సంబంధించిన ప్రతి చిన్న విషయంలోను జోక్యం కల్పించుకుంటారు. అతడు పుట్టిన తర్వాత, అతని బాల్యదశనంతా దయతో గమనిస్తూ కనిపెట్టుకుని ఉంటారు. అతడు మానవాళి హృదయాల్లో ప్రేమ బీజాన్ని నాటడంద్వారా ప్రపంచానికి విముక్తిని కలిగించే విశ్వ కార్యక్రమాన్ని ప్రారంభించే సమయము అతనికి ఆసన్నము కాగానే ఆ అయిదు గురు సద్గురువులు, ఆయనవే అయిన అనంత ఆనందం, అనంత జ్ఞానం, అనంత శక్తుల అనుభవాన్ని అందించి, తనదే అయిన స్వీయ ప్రపంచాన్ని దాని నిర్వహణ బాధ్యతను ఆయనకు వప్పగిస్తారు.

మన కాలంలో అవతారుని అవతరణను వేగిర పరచిన పంచ సద్గురువులు బాబా జాన్, షిర్డి సాయిబాబా, ఉపాశినీ మహరాజ్. నారాయణ మహరాజ్, తాజుద్దీన్ బాబాలు. పూనాలోని బాబాజాన్ మేర్వాన్‌కు అనంతానందాన్నిచ్చింది. పూనా నడి బజారులో ఒక వేపచెట్టు క్రింద అవతారుడి రాకకై ఎదురుచూస్తూ గడిపిన సద్గుర్విణి. పూనా దక్కన్ కాలేజీలో ఇంటర్మీడియట్ చదువుతుండగా మేర్వాన్ ఈమెకు ఆకర్షితుడయ్యాడు. చదువుపై క్రమంగా శ్రద్ధ తగ్గి ఆమెకై పరితపించసాగాడు. **1914** జనవరిలో ఒకరోజున మేర్వాన్ కాలేజీనుండి తన సైకిల్‌పై వస్తుండగా 110 ఏళ్ళ వయస్సున్న ఆ వృద్ధ సద్గుర్విణి తన చెంతకు రమ్మన్నట్లు సౌంజ్ఞచేసి, చెంతకు వచ్చిన మేర్వాన్ నుదుటిపై చుంబించింది. ఆమె స్పర్శ ప్రభావం వల్ల మేర్వాన్ అనంతానందానుభవాన్ని పొందాడు.

దీని తర్వాత మేర్వాన్ జీవితంలో పెను మార్పు జరిగింది. తొమ్మిదినెలల పాటు నిద్రాహారాలు మానివేశాడు. శరీరస్మృతిని కోల్పోయి

పిచ్చివాడిలా తయారయ్యారు. తల్లి షిరీన్ అది వ్యాధి అనుకొని ఎన్నో వైద్యాలు చేయించింది. ఎన్ని మందులు వాడినా నివారణ కాలేదు. **1915**లో షిర్డీలోని సద్గురువు సాయిబాబాను సందర్శించి, నడిరోడ్డుపై మేర్వాన్ సాష్టాంగపడగా "ఓ పర్వర్దిగార్" అంటూ ఆయన మేర్వాన్‌ను మూడుసార్లు బిగ్గరగా పలికి అతనిలో తన అనంతశక్తిని మేల్కొలిపారు. సాయిబాబా ప్రేరణవల్ల అప్పట్లో ఖండోబా దేవాలయంలో వుంటున్న ఉపాశినీ మహరాజును మేర్వాన్ దర్శించగా ఆయన ఒక గులకరాతిని మేర్వాన్‌కు గురిచూచి విసిరి స్వాగతం పలికారు. ఆ రాయి తిన్నగా మేర్వాన్‌ను బాబాజాన్ ముద్దిడిన భృగు మధ్య భాగంలో తగిలి గాయ పరచింది. రాయి భూమిక చిహ్నం. కనుక దానిద్వారా ఉపాశినీ మహరాజు మేర్వాన్‌లో నిద్రాణమైయున్న అనంత జ్ఞానాన్ని తట్టిలేపి అందించారు. దాని ఫలితంగా మేర్వాన్ క్రమంగా ప్రాపంచిక స్పృహకు రాసాగాడు. తదుపరి ఖండోంలోని నారాయణ మహరాజును కలవగా తన ఛత్ర సింహాసనంపై కూర్చోపెట్టి గ్లాసుడు మామిడిపండు రసాన్ని అందించి సకలలోకరాజ్య సింహాసనా రూఢుడ్ని చేశారు. అలాగే నాగపూర్‌లోని తాజుద్దీన్ బాబా గులాబీలతో కూడిన స్వర్గసౌరభాలతో యీ రాజుకు కిరీటధారణ చేశాడు.

మెహెర్‌బాబా ఈ ప్రపంచానికివున్న ఒకే ఒక్క తాళంచెవి పంచ సద్గురువుల చేతుల్లో ఉందని వెల్లడించారు. ఉదాహరణకు ఒక బీరువా ఉంటే దానికి ఒకే తాళంచెవి వుంటుంది కదా! దానితోనేతప్ప మరే ఇతర తాళంచెవితోనూ అది తెరవబడదు. అలాగే ఆ బీరువా వంటి యీ ప్రపంచానికివున్న ఏకైక తాళంచెవిని తమ వద్దనే వుంచుకొని, పంచ సద్గురువులు యీ ప్రపంచాన్ని నియంత్రిస్తున్నారు. ఒక గురువు తన వద్ద ఆ తాళం చెవిని ఉంచుకున్నాడు. అది లేకుండా ఆ బీరువా తెరవబడదు. రెండవ గురువు ఆ బీరువాకు కావలి వున్నాడు. ఆయన అనుమతింలేనిదే బీరువా తాళం తీయుటకు వీలులేదు. మూడవ గురువుకు మాత్రమే ఆ బీరువా తాళం చెవిని ఉపయోగించి తెరిచే అధికారమున్నది. నాల్గవ గురువుకు ఆ బీరువాలోని సంపదను పంచే హక్కున్నది. అయిదవ గురువు అలా

పంచిపెట్టుటకు అనుమతించే అధికారము ఉంది. ఈ విధంగా యీ ప్రపంచానికి ఒకే శాశంజెవి మాత్రమే ఉండి అయిదుగురు సద్గురువులమధ్య సమంగా దాని బాధ్యతలు పంచబడినవి.

ఆ పరాత్పర పరబ్రహ్మానుభూతిని పొంది, అనంతానందంలో మునిగిపోయిన మేర్వాన్ పంచ సద్గురువుల సమాగమప్రాప్తి అనంతరం తిరిగి స్వావస్థకు చేరుటకు దాదాపు ఏడేళ్ళు పట్టింది. ఆ కాలమంతా ఉపాశినీ మహరాజుతోనే గడిపినా తల్లి మనోభీష్టానికనుగుణ్యంగా నడుచుకున్నాడు. ఉద్యోగంతో ఉంటే కోలుకుంటాడేమోనని తల్లి ప్రోద్బలం చేసింది. కొన్నాళ్ళు ఉపాధ్యాయుడిగా పని చేశాడు. సినిమాహాల్లో డ్రామా కంపెనీలో, తండ్రి కల్లంగడిలో ఇలా చాలా ఉద్యోగాలు చేశాడు. తాను ఎంత సంపాదించినా భౌతిక జీవనంపై ఉత్సాహాన్ని చూపకుండా పేదలకు పంచిపెట్టేవాడు. తను తినుటకు పెట్టిన ఆహారాన్ని కుక్కలకు పెట్టి తినిపించేవాడు. తినే తిండిపైనా, కట్టుకున్న దుస్తులపైన సైతం మమకారాన్ని చంపుకున్నాడు. తన ధ్యానమంతా భౌతిక బంధాలకతీతంగా కేంద్రీకరించి దీనజనోద్ధరణపైనే కేంద్రీకరించాడు. లోకోద్ధారకుడైన అవతారుడిగా ఆయన్ని ప్రశంసిస్తూ పంచ సద్గురువులు తమ శిష్యులకు ప్రభోదించారు.

ఒకరోజున ఉపాశినీ మహరాజు తన శిష్యులనుద్దేశించి, "నేను చెప్పేది మీరంతా జాగ్రత్తగా వినండి. మేర్వాన్ అవతార పురుషుడు. ఇప్పుడు మీరంతా అతని పాదాల్ని గట్టిగా పట్టుకోండి. ఒక చేత్తో కాక రెండు చేతులతో గట్టిగా పట్టుకొనుడు" అని ప్రకటించారు. 1921లో మేర్వాన్ ఉపాశినీ మహరాజుతో సన్నిహితంగా ఆరునెలలు గడిపిన అనంతరం, గౌరవ ప్రదమయిన ఆధ్యాత్మిక అధికారముతో తన మంత్రాంగాన్ని ప్రారంభించారు. పునాకస్బాపేటలో తన తొలి ఆశ్రమాన్ని కొద్ది మంది శిష్యులతో ప్రారంభించారు. తనకంటే పెద్దవాళ్ళు అత్యధికంగా శిష్యులై తనను అనుసరించగా వారందరికి తనదైన అద్వితీయ శైలిలో వారందరికి ఆధ్యాత్మిక శిక్షణలో తర్ఫీదునిచ్చారు. ఆరునెలల అనంతరం కాలినడకన బొంబాయికి తన శిష్యుల్ని వెంటబెట్టుకొని వెళ్ళారు.

మంజిల్ - ఇ-మీమ్ అని ఒక అద్దె భవనానికి పేరుపెట్టి అందులో శిష్యులతో కొంతకాలం గడిపి, వారికి పూర్తి క్రమశిక్షణను నేర్పారు.

ఆయన తరచు ఉపవాసము, ఏకాంతవాసము వంటివి ఆచరించేవారు. అవి తన శిష్యుల ఆధ్యాత్మిక లాభంకొరకే తాను చేస్తున్నట్లు ఆయన చెప్పేవారు. తనకు అనుభవమైన దివ్య చైతన్యానికి ఎటువంటి భంగం కలుగకుండా పరిపూర్ణ మానవ చైతన్యాన్ని సంతరించుకొని అవతార కార్యక్రమాన్ని నిర్వహిస్తున్న మేర్వాన్‌ను ఆయన శిష్యుల్లో ఒకరైన సయ్యద్ సాహెబ్ అనే శిష్యుడు "మెహర్ బాబా" అని సంబోధించగా అప్పటినుండే మేర్వాను మెహర్‌బాబా పేరు చిరస్థాయిగా ఉండిపోయింది. మెహర్ బాబా అంటే దయగల తండ్రి అని అర్థం. 1923 లో బొంబాయి ఆశ్రమాన్ని ఎత్తివేసి, అహ్మదునగరంకు సమీపంలోని అరంగాం అనే గ్రామం దగ్గర తన శాశ్వత ఆశ్రమాన్ని నెలకొల్పి శిష్యులతో స్థిరనివాసం ఏర్పరిచారు. తన శిష్యులకు ఇక్కడే గమేలా యోగాభ్యాసాన్ని చేయించారు. శారీరక కష్టంచేసి, ఆశ్రమభవనాన్ని నిర్మించారు. ఇంటి పనులు, వంట పనులు అన్నీ శిష్యులే నిర్వహించేట్లు చేశారు. ఈ స్థానమే యీనాటికీ "మెహరాబాదు" అని పిలువబడుతోంది.

తన కార్యక్రమంలో భాగంగా ఆసుపత్రి, డిస్పెన్సరీ, పాఠశాల వంటివి ఇక్కడ స్థాపించారు. కుష్ఠు రోగులకు, పేదలకు స్వయంగా సేవలు చేశారు. పిచ్చివాళ్ళకు, మస్తులకు ఆశ్రమాలు నడిపారు. బాబా తన విశ్వ కార్యక్రమంలో పునాది రాళ్ళుగా వీటన్నిటినీ ప్రతిష్ఠించారు. కనుకనే యీ నాదవన్నీ ప్రపంచ ప్రగతికి మూలాధారాలై ఆయా రంగాల్లో విశిష్టస్థాయికి ఎదిగి విరాజిల్లు తున్నాయి. కుల వ్యవస్థ లోతుగా వేళ్ళూని, నిరాదరణకు గురైన అస్పృశ్యుల్ని సమాజంలో, సుసంఘటితులను చేయుటకు ఎనలేని కృషి చేశారు. ప్రేమాశ్రమం పేరిట పాఠశాలను ప్రారంభించి జాతి కులమత వివక్షత లేకుండా అన్ని వర్ణాల పిల్లల్ని చేర్చుకొని స్వయంగా పాఠాలతోపాటు ఆధ్యాత్మికతను కూడా ప్రబోధించారు. ఆ నాడు బాబా ప్రారంభించిన ప్రతి కార్యక్రమం ఆయా

క్షేత్రాల్లో క్రమంగా విస్తృత పరచబడి ఇప్పుడు అఖిల ప్రపంచానికి అందుబాటయ్యాయి.

మెహర్ బాబా జీవితంలో అద్భుతమైన ఘట్టం. మౌనం మెహర్ బాబా, మెహరాబాదు ఆశ్రమంలో వివిధ కార్యక్రమాల్ని నిర్వహిస్తూ అనూహ్యమయిన ఆధ్యాత్మిక కారణాలవల్ల తన అవతార కార్యక్రమంతో భాగంగానే 10 జూలై 1925 నుండి మౌనాన్ని ప్రారంభించారు. 1969 జనవరి 31 న తన పాంచభౌతిక శరీర పరిత్యాగం చేసేవరకు దాదాపు 44 ఏళ్ళపాటు తన అఖండ మౌనాన్ని కొనసాగించారు. మౌనం ప్రారంభించిన తొలిరోజులలో తన భావాల్ని పలకలపై వ్రాసి వ్యక్తపరిచేవారు. ఇంతవరకూ వ్యక్తంచేయని ఎన్నో ఆధ్యాత్మిక సత్యాల్ని ఒక కొయ్య భోషాణంలో కూర్చొని ఏకాంతంగా గ్రంధస్థం చేశారు. ఆ పుస్తకం ఇంతవరకు ప్రచురించ బడకుండా గుప్తంగా ఉంచబడింది. దానిలో పొందు పరచిన విషయాల్ని గ్రహించగలిగే స్థాయికి మానవాళి చేరిన తరవాతనే అది ప్రచురించ బడుతుంది, ఆయన అనుయాయులంతా ఆ రోజు కొరకు ఎదురు చూస్తున్నారు. కొంతకాలానికి వ్రాయుటకూడా మాని ఆంగ్ల అక్షర ఫలకంపై అక్షరాలను చూపిస్తూ తన భావాల్ని అందించేవారు. 7-10-54 నుండి ఆ అక్షరఫలకాన్ని కూడా విసర్జించి, కేవలం తన చేతి సౌంజ్ఞలద్వారా తన సందేశాలను అందించారు.

అంతకాలం తాను మౌనానాన్ని పాటించుటకు మెహర్ బాబా కారణాన్ని వివరిస్తూ మౌనంద్వారా తాను విశ్వాత్మక వ్యధలకు పైన నేను వున్నావని మౌనంద్వారా మరింత స్పష్టంగా మాట్లాడవచ్చని, యధార్థ విషయాలెప్పుడూ మౌనంలోనే ఇచ్చిపుచ్చుకొనుట జరుగుతుందని చెప్పారు. "మానవుడు గతంలో దైవంచే నిర్దేశించ బడిన నియమాలు, ధర్మసూత్రాలను పెడచెవి పెట్టినందువల్ల నా యీ ప్రస్తుత అవతార రూపంలో నేను మౌనాన్ని పాటిస్తున్నాను. మీరంతా ఎన్నో అర్థించారు. అందుకాలినాన్ని మాటలందించ బడినయి. ఇప్పుడు వాటన్నిటినీ సజీవ పరచే సమయ మాసన్నమైనది" అన్నారు.

1931వ సంవత్సరంనుండి మెహర్‌బాబా విశ్వవ్యాప్తమైన పాశ్చాత్య ప్రయాణాలు చేశారు. ఇంగ్లండు, అమెరికా, ఐరోపా, చైనా తదితర దేశాలలో పర్యటించి, తన దర్శన, స్పర్శభాగ్యాన్ని కల్పించారు. ఒక భారతీయ సద్గురువుగాకాక, సాక్షాత్తు అవతార పురుషుడిగా తన పర్యటనలను జరిపారు. పాశ్చాత్యులకు, భౌతిక సంపదలను కూడాబెట్టుటే తమ లక్ష్యం కారాదని, తమలోనే అంతర్గతంగా ఆత్మ స్వరూపుడై యున్న ఏకైకుడ్ని సాక్షాత్కరించుకొని ప్రబోధించారు. అవతారుడికి విధేయులై ప్రేమతో సర్వార్పణగుటయే ఇందుకు సుళువైన మార్గమని సూచించారు. ఎంతో ఆప్యాయతతో తన స్వంత కుటుంబ సభ్యులుగా వారి ఇళ్ళకువెళ్ళి గృహ సందర్శనలు జరిపారు.

బాబా పాశ్చాత్య పర్యటనల సమయాల్లో వీటి పర్యాయాలు మహాత్మాగాంధీ మెహర్‌బాబాను కలిసి ఆధ్యాత్మిక సత్యాలగురించి రాజకీయ విషయాల గురించి సలహాలు అడిగి తెలుసుకున్నారు. మెహర్‌బాబా ఎన్నడూ ప్రచారాన్ని కోరలేదు. విమర్శలను, పొగడ్తలను సమానంగా స్వీకరించారు. నాడిల్ టాల్‌స్టాయె, ప్రిన్సెస్ మాచ్‌బెల్లి, కిట్టీడలీ, ఐ. వీ. డ్యూస్ వంటి పాశ్చాత్యులెందరో బాబాను తొలిసారి సందర్శించగానే ఆయనలో తమ జీసస్‌ను ప్రత్యక్షంగా చూచి, జీసస్సేమళ్ళీ మెహర్‌బాబాగా అవతరించాడని విశ్వసించి ఆజన్మాంతం బాబా సేవకు అంకితమై సర్వస్వం అర్పించుకున్నారు. ఎందరో స్త్రీ పురుషులు ఆయనకు శిష్యులై తమ సర్వస్వం త్యజించి జీవితాలను తృణప్రాయంగా ఆయన సన్నిధిని సమర్పించుకున్నారు.

భూగోళంలో ముఖ్యంగా మన భారతభూమికి ఒక ప్రత్యేక విశిష్టత ఉన్నది. ఇది ఆధ్యాత్మికంగా ప్రసిద్ధి చెందటమేగాక, దీనికి ఒక సనాతన వారసత్వంతోపాటు మహా పవిత్ర యాత్రాస్థలాలెన్నో విరాజిల్లుతున్నాయి. ఈ పావన భూమిపై ఎందరో పుణ్యపురుషులు ఉద్భవించారు. గురువులు, యోగులు, మహాపురుషులు, సాధుసన్యాసులు, మునులు, ఫకీర్లు, మస్తులు మన యీ భారతభూమిలో కోకొల్లలు. భారతావనిలో ఏ మూల చూచినా,

ప్రపంచంలో ఏ దేశంలోనూ లేనన్ని పుణ్యక్షేత్రాలు, మహాపురుషులు కనిపిస్తారు. ఆత్మసాక్షాత్కారం పొందిన వారిని కనుగొనుట చాలా కష్టం. అటువంటి వారిని చాలా అరుదుగా మాత్రమే కలుసుకొన గలుగుతాం. ఆధ్యాత్మిక పరిభాషలో వీరందరిని, బ్రహ్మీ భూతులని, సుజ్ఞాన్‌లని, జీవన్ముక్తులని, పరమహంసలని, సద్గురువులని, కుతుబ్‌లని సంబోధిస్తారు. ఇటువంటి విభిన్నమైన అత్యున్నత ఆత్మలలో సర్వోన్నతుడిని అవతార పురుషుడు అంటారు.

మెహర్‌బాబా తన అవతార కాలములో ప్రాపంచిక వ్యవహారాలన్నీ చక్కబెడుతూ, ఆత్మప్రబోధ కరములూ విశ్వకళ్యాణ కారకులయిన అనేక బోధలను, అఖండ మౌనంలోనే అందించారు. ఆయన దివ్య కరుణాకటాక్ష వీక్షణములతో అవ్యాజానుగ్రహమును కురిపించి ఎందరినో ఆత్మప్రబోధితుల్ని చేశారు. అనేక జన్మల సముపార్జితమైన సంస్కారములతో నిండిన తన శిష్యుల్ని తన ఆధ్యాత్మిక కార్యసాధనకు వినియోగించుటకై సంస్కారబంధ విముక్తుల్ని చేయటమేకాక, లోకోద్ధరణకై వారిని ఉపకరణములుగా వినియోగించారు. ఆయన తన శిష్యులకు కఠోర నియమాలు విధించేవారు. ఆయన ఆదేశాలను తు. చ. తప్పక ఆచరించుట వారి విధి. ఒకవేళ ఎవరయినా తన నిబంధనలను ఉల్లంఘిస్తే ఆయనే ఒక గదిలో బంధించుకొని రోజులు తరబడి, అన్నపానీయాలు తీసుకోకుండా తనకు తాను శిక్షించుకునేవారు. అందువల్ల శిష్యులంతా ఎంతో అప్రమత్తులై ఉండేవారు.

ఒకసారి తన శిష్యులు ముగ్గురిని పిలిచి, ఒకరిని తన ఎదుట, మరొకరిని కుడిపక్కన, మరొకరిని ఎడమపక్కన కూర్చోమని ఆదేశించారు. ఆ ముగ్గురు తనతో రైలులో ప్రయాణంచేసే సమయంలో సైతం అలాగే కూర్చోవాలని శాసించారు. ఇది ఎంత విపరీతమైన నిబంధన అయినప్పటికీ వారు ఆచరించారు. ఆశ్రమంలోని శిష్యుల్ని అప్పుడప్పుడు, ఒకటి రెండు రోజులపాటు ఉపవాసము నుంచేవారు. ఉపవాసము లున్నప్పటికీ, వారు యథావిధిగా ఆశ్రమకార్యక్రమాలను నిర్వహించవల

సిందే. అటువంటి సమయంలో మామూలుకంటె ఎక్కువ పనులు కలి పించి, వారిలో సహనము అలవడేటట్లు చేసేవారు.

ఒకరోజున ఉపవాసమున్న శిష్యుల్ని పిలిచి నగరులోనికి వెళ్ళి కుంటి, గ్రుడ్డి భిక్షకుల్ని రెండు వందలమందిని తీసుకురమ్మని ఆదేశిం చారు. పాపం వారు అసలే ఉపవాసమున్నారు. అందులో ఆశ్రమ కార్య క్రమాలు చేయుటవల్ల బాగా నీరసించి అలసిపోయారు. వారిని తక్షణం వెళ్ళి 200 మంది భిక్షకులను వెంటపెట్టుకుని రమ్మన్న బాబా ఆజ్ఞను పాటించుట వారి తక్షణ కర్తవ్యమైంది. పాపం! వాళ్ళంతా ఎంతో కష్ట పడి 200 మంది భిక్షకులకు మిక్కిలి కష్టంమీద వెంటపెట్టుకురాగా బాబా వారందరికీ స్నానం చేయించి, స్వయంగా అన్నవస్త్రములు సమర్పించారు. ఈవిధంగా బాబా తన శిష్యులలో సహనశక్తిని, సర్వార్పణ బుద్ధిని పరీ క్షించి తన అనుయాయులుగా తీర్చిదిద్దారు. భగవంతుడు మానవుల యందు తనకున్న ప్రేమ ద్వారానే భగవంతుడగుటకు సాధ్యపడు తుంది.

మెహెర్‌బాబా అవతార కార్యక్రమంలో ప్రధాన అంశము మస్తుల కార్యక్రమం. మస్తులంటే భగవత్ప్రేమలో ఉన్మత్తులైన మహనీయులు. వారికి భౌతిక ప్రపంచపు చైతన్యము ఎంతమాత్రము ఉండదు. వీరికొరకు బాబా ఒక ఆశ్రమాన్ని నడిపారు. మస్తుల అన్వేషణలో ఎనలేని ప్రయా ణాలు చేశారు. స్వయంగా వారిని కలిసి, ఆధ్యాత్మిక పథంలో ముందుకు పురోగమించుటకు సహాయపడ్డారు. కఠినమైన యీమస్తు ప్రయాణాల్లో వేల కొలది మైళ్ళు అన్నిరకాల ప్రయాణ సాధనాలను ఉపయోగించి పయ నించారు. కార్లు, టాంగాలు, ఎడ్లబళ్ళు, గుర్రం, గాడిద, ఒంటెలపైనే కాక, కాలినడకనకూడా ఆ ప్రయాణాలుచేసి, మస్తులను కలుసుకునే వారు. తనతో మస్తుపర్యటనలో పాల్గొనే శిష్యుల్లో బైదిలు, కాకా బారియా లేదా ఎరుచ్‌లను ఎంపికచేసి వెంటపెట్టుకు వెళ్ళేవారు. ఎడారిప్రాంతాల్లో, దట్టమైన అడవిప్రాంతాల్లో, పర్వతాలు, లోయల్లో, కొండల్లో, కోనల్లో ఈ మస్తుల అన్వేషణ జరిగేది. రాత్రింబవళ్ళు, చూశిదూసరితమై క్రిక్కిరిసిన

ప్రయాణీకుల మధ్య 3వ తరగతి రైలుపెట్టెల్లో సర్దుకొని ప్రయాణాలు చేసినఘట్టా లెన్నో వున్నాయి.

మస్తులు ఏ పొదలమాటునో వుండి సులభంగా చిక్కేవారు కాదు. పట్టణాలు, గ్రామాల్లో సైతం ఎదురుగా కనిపించేవారు కాదు. మస్తు అరుదుగా లభించే మణివంటివాడు. అటువంటి మస్తుల్ని ఎంపికచేసి తీసుకురావటంలో చాలా శిష్యులు ఎన్నో అనుభవాలు గడించారు. విశిష్టమైన మస్తు యాత్రలో బాబా తన శిష్యులతోపాటు 75000 మైళ్ళ దూరం ప్రయాణాలుచేసి 20,000 మందికి పైగా మస్తుల్ని కలిసే కృషి చేశారు. మస్తు ప్రయాణాల్లో శిష్యులు అన్నపానీయాలు తీసుకొనకుండా, లక్ష్యము వైపే దృష్టిని వుంచి మస్తు అన్వేషణ చేసేవారు. ఒక్కొక్కసారి రెండు మూడు వారాలు సైతం కొనసాగించేవారు. మెహెర్‌బాబా అన్వేషణలో పాల్గొనే శిష్యుడిలో ప్రేరణను కలిగించి, వారి శక్తి అవధులు దాటకుండా పనిచేయించేవారు. 1946లో జరిగిన పర్యటనలో బైదులు అనే శిష్యుడు 8 రోజులపాటు ఏకధాటిగా అన్వేషణలో పాల్గొన్నాడట. అటువంటి కష్టాలెన్ని ఎదుర్కొన్నా బాబా వీరినందరినీ ఎంతో తాజాగా ఉంచేవారు.

ఒకసారి పాకిస్తాన్, పంజాబులో మెహెర్‌బాబా తన శిష్యులతో మస్తు పర్యటన చేస్తూ. "ఎల్చా" అనే శిష్యుడు బాబా కారును డ్రయివ్ చేస్తున్నాడు. "బైదిలు" అనే శిష్యుడుకూడా బాబాతో వున్నాడు. వారు కలవాల్సిన మస్తు ఉండేప్రాంతము భయంకరమైన బందిపోటు దొంగలకు నిలయం. అతిప్రమాదకరమైన ప్రాంతమైనందున, ఎల్చా ఆ ప్రదేశం గురించి బాబాకు వివరిస్తూ, "బాబా, ఈ ప్రాంతమంతా బందిపోటు దొంగలమయం. చీకటిపడితే బయటసంచారము ప్రమాదకరము. మనం మస్తు దగ్గరకు వెళ్ళి తిరిగి రావటానికి బాగా చీకటి పడుతుంది. ఇప్పటికే సాయంత్రమైపోయింది. అందువల్ల దగ్గర్లో ఆగిపోయి, ఉదయాన బయలుదేరితే క్షేమకరము" అని వివరించాడు. బాబా అతనిసలహాను అంగీకరించలేదు. తనపక్కన కూర్చున్న బైదిలును దించి, ముందుసీట్లో డ్రయివరు

పక్కకుపంపి, మస్తుదగ్గరకుచేరే దగ్గర దారిని చూపమని ఆదేశించారు. డ్రైవరు క్షణకాలంపాటు తనలో "ఈ ప్రాంతాన్ని నేనెన్నడూ చూడనేలేదు. మస్తున్నచోటు అంతకన్నా తెలియదు. నేనేమిటి? దగ్గర దారి చూపుట ఏమిటి?" అని తర్కించుకున్నాడు. అయితే ఆ మరుక్షణంలోనే బాబా ఆదేశాన్ని విధేయతతో పాటించుటే తన కర్తవ్యంగా తీసుకున్నాడు. భారమంతా బాబాపైనే వేసి లక్ష్యాన్ని ఆచరణలో పెట్టాడు. బాబా ప్రేరణతో డ్రయివరుకు సూచనలివ్వసాగాడు. అతను చూపుతున్న దారిలో కారు ఎన్నో మలుపులు తిరుగుతూ కొద్దిసేపట్లోనే సరిగ్గా మస్తు ఉన్నచోటుకు ఎదురుగా ఆగింది. మరుక్షణంలోనే బాబా మస్తును ఏకాంతంగా కలుసుకొనుట పూర్తిచేసి బయటకు రాగానే తిరుగుప్రయాణమై ఆ ప్రమాద భరిత ప్రాంతంనుంచి ఎటువంటి అవాంతరం లేకుండా సురక్షితంగా తమవిడిదికి చేరుకున్నారు. ఆ సమయంలో బాబా ఏదో ఒక గొప్పకార్యాన్ని సాధించినట్లు, తేజోమంతుడిగా దివ్యతేజస్సుతో వెలిగిపోతూ కనిపించారు.

మెహెర్‌బాబా కార్యక్రమాలు ఒకేచోటుకు కేంద్రీకృతమై వుండేవి కావు. భారతావనిలోను, సిలోను, ఆఫ్ఘనిస్థాన్, ఇరాన్‌వంటి ప్రాంతాల్లో ఎనలేని ప్రయాణాలు చేశారు. బాబా నిర్వహించిన కార్యక్రమాల్లో మరో ముఖ్యకార్యక్రమం, పేదలకు, కుష్టురోగులకు సహాయపడిన కార్యక్రమం చాలావిలువైనది. వారిని స్నానం చేయించుట, ఆహారము తినిపించుట, వారిపాదాలను కడిగి నమస్కరించుట, ధనసహాయంతోపాటు వస్త్రదానమిచ్చుట అతిముఖ్య విషయాలు. ఆర్థికంగా దెబ్బతిన్న మధ్యతరగతి కుటుంబాలు, హఠాత్తుగా సంభవించిన భారీ ఆపదల్లో చిక్కుకున్నవారు, వరదలు మున్నగు ప్రకృతి బీభత్సంలో చిక్కుకొని అనాధలయినవారు, బాగా బ్రతికినప్పటికి కాలప్రవాహంలో సర్వం కోల్పోయి "దేహి" అని చేయిచాచి యాచించలేక దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నవారు బాబా ఆదరణకు గురియై స్వయంగా అవతారుని చేతులమీదుగా బహుమతి రూపంలో సహాయాన్నందుకున్నారు. బాబా ధనాన్నెన్నడూ ముట్టుకోకపోయినా అవసరమున్న వ్యక్తులకు తనచేతుల మీదుగానే అందించారు. ఇటువంటి సేవా సహాయకార్యక్రమాల సహాయంలో జేసే ప్రయాణాలన్నీ

బాబా మారువేషంలోనే నిర్వహించారు. తన గుర్తింపును బహిర్గత పడకుండా శిష్యుల్ని కట్టుదిట్టం చేశారు.

బాబా మారువేషంలో చేసిన పర్యటనలు ఏదో ఒక ప్రాంతానికి పరిమితం కాకుండా యావద్భారతదేశం చుట్టివచ్చారు. ఒక వేపు మారు వేషంలో అవసరార్థులను కలుసుకొని సహాయపడుతూనే, మరోవేపున బహిరంగ ప్రజాదర్శనలిచ్చి జనసమూహములకు తన దర్శన భాగ్యాన్ని కలిగించేవారు. ప్రతిరోజూ వందలువేలు ప్రతినిత్యంవచ్చి బాబాను దర్శించి తమ భక్తి ప్రపత్తులను ప్రదర్శించి ఆశీస్సులు పొందేవారు. మెహెర్‌బాబా వివరించినట్లు, ఆయన ఏ కార్యక్రమంచేసినా దానిద్వారా మనంనేర్చుకోవలసిన సత్యాన్ని ప్రబోధించుటకేగాని, తనకోసరం మాత్రం కాదు. మానవాళిని మేల్కొలిపి, నిజాత్మను సాక్షాత్కరించుకోగల చైతన్యాన్ని మనలో కలిగించుటకే బాబా కార్యక్రమాలన్నీ నిర్దేశించబడినవి.

1965 మే 1వ తేదీన పూనా గురుప్రసాద్‌లో మెహెర్ ప్రేమిక సహవాస్ మరియు పూనా మెహెర్ సెంటరు ప్రారంభోత్సవ కార్యక్రమాల్ని ఏర్పాటుచేసి ప్రేమికులను దేశవిదేశాలనుండి ఆహ్వానించారు. ఆ కార్యక్రమానికి బ్రహ్మాండమైన ఏర్పాట్లు జరిగాయి. ఏర్పాట్లను బాబా స్వయంగా పర్యవేక్షించారు. రేపు సహవాస్ జరుగుతుందని ముందు రోజే ప్రేమికులంతా పూనాకు చేరుకున్నారు. బాబాకు అదే రోజున హఠాత్తుగా తీవ్రమయిన జ్వరం వచ్చినట్లు, బాబా 140 డిగ్రీల F జ్వరంతో బాధ పడుతున్నట్లు మండలి గ్రహించారు. ఆయన అనారోగ్య విషయాన్ని మండలి బహిరంగంగా ప్రకటించటం కూడా జరిగిపోయింది.

సహవాస్‌లో పాల్గొనాలని దూరప్రాంతాల నుంచి వచ్చిన వారంతా బాబా జ్వర తీవ్రతను గురించి తెలిసికొని ఆందోళన చెందారు. రేపు జరుగబోయే సహవాసీకు బాబా హాజరవుతారో లేదోనని ఆదుర్దా పడసాగారు. అయితే ఏర్పాట్లన్నీ నిరాటంకంగానే, యధావిధిగా జరిగిపోయాయి. మర్నాడు ఉదయం 6-00 లకే బాబా పూనా సెంటరు ప్రారంభోత్సవం పూర్తిచేసి, సహవాసీ కార్యక్రమంలో పాల్గొనుటకై సభా

ప్రాంగణానికి వచ్చారు. తన కారులో నుండి దిగుతున్న బాబాను చూచిన వారంతా "అవతార్ మెహెర్‌బాబాకి జై!" అంటూ జయ జయ ధ్వానాలు చేశారు. బాబా దివ్య తేజస్సుతో వెలిగిపోతున్నారు. అటువంటి దివ్య మంగళ స్వరూపుడికి మండలివారు అనారోగ్యాన్ని ఆపాదించి, జ్వరమని అబద్ధాలు ప్రచారం చేశారని నిరశిస్తూ వారిని దుర్భాషలాడారు కూడా. ఈ పరిణామానికి ఖంగుతిన్న మండలి నిశ్శబ్దంగా ఉండిపోయారు. ఆనాటి సహవాస్‌కు వేల సంఖ్యలో మెహెర్ ప్రేమికులు పాల్గొని ఆనంద పర వశులై బాబా ప్రేమను ఆస్వాదించారు. అంతమంది ప్రేమ ఆయన బాధను పూర్తిగా మరిచిపోయేట్లు చేసిందని బాబా అంటారు.

బాహ్యంగా ఆయన శారీరక బాధ వ్యక్తమైనప్పటికీ ఆయన చేసే అంతరంగిక కార్యక్రమ కారణము రీత్యా మానవుల ఆధ్యాత్మికలబ్ధికే ఆయన దర్శన స్పర్శలు ఉపయోగపడుతాయని మనం గ్రహించాలి. మన మెఱిగిన ఏ శ్రేణికి చెందిన వారిలోను, మెహెర్‌బాబా ఇమిడిలేరు. ఆయన గురించి మామూలు అనుభవాలు చెప్పలేవు. క్షణకాలం ఆయన దివ్య సన్నిధిలో గడిపితే మనం తరించినట్లే. మనం ఆ అనుభవం మనకు రావా లంటే, ఆయన్ని ప్రేమించవలసిన రీతిలో ప్రేమించి ఆయన కృపకు పాత్రులం కావాలి. ఆయన మాత్రమే సత్యమని, తక్కినదంతా మిథ్య అని తెలుసుకో కలిగితేనే ఆయన్ని ప్రేమించే అర్హులమవుతాం. మెహెర్‌బాబా కేవలం జ్ఞానానికే గురువు. ఆ జ్ఞానంలోనే అన్ని జ్ఞానాలు ఇమిడి ఉన్నం దున ఆయన దైవమానవుడయ్యాడు.

ఒకతను బాబా నొకసారి ప్రేమించుట ఎలా?" అనడిగాడు. "ఏమో నాకేం తెలుసు? అది మీరే తెలుసుకోవాలి. నన్ను మీరెలా ప్రేమించాలో మీకే తెలియాలి. నేను ప్రేమ మహా సాగరాన్ని!" అని బాబా బదు లిచ్చారు. కళ్ళప్పగించి చూస్తున్న అతడ్ని గమనించి బాబా ఎలా ప్రేమిం చాలో కూడా వివరించారు. "చక్కని అమ్మాయిని చూచినప్పుడు, మొదటి చూపులోనే ప్రేమలో పడ్డారనుకోండి! మరప్పుడు మీకు విశ్రాంతిఉండదు. నిద్రపట్టదు. తిండి ధ్యాస అసలే ఉండదు. నిద్రాహారాలు పూర్తిగా మాని

వేస్తారు. ఆకలిని కోల్పోతారు. ప్రపంచంలో మరేదీ రుచించదు. మీ ఆలోచనల్లో మిగిలేది ఆ ప్రియురాలు మాత్రమే! ఆమెను ఎప్పుడు కలుస్తానా? ఆమె నా స్వంత మెప్పుడు అవుతుందా! అని తపించిపోతారు. అప్పుడు మీరు కోరేది ఆ చక్కని చుక్క మీ స్వంతమైపోవటమొక్కటే. అలాగే నిద్రాహారాలు మరిచి, నాకు బాబా మాత్రమే కావాలన్న తపనతో నన్ను ప్రేమించాలి.

దీనర్థం, నిజంగా అన్నం తినుటమాని నిద్రించుట మాని, ముక్కు మూసుకుని కూర్చోవటం కాదు. అంత తీవ్రంగా తితీక్షతో బాబానుగురించే ఆలోచించాలి. నిరంతరం సర్వకాల సర్వావస్థల యందు బాబాను స్మరిస్తూ జ్ఞాపకము పెట్టుకొనుట ముఖ్యం. బాబాను గురించి తెలుసుకొని, ఆయన ప్రేమలోపడి ఆయన దర్శనభాగ్యానికై తపనపడి, చివరకు ఆయన కరుణ సంపాదించుట ఎలాగో ఈ క్రింది సంఘటనలో అవగతమవుతుంది.

బాబా శిష్యగణంలో ఒకాయన ఉన్నాడు. ఆయన బాబాను ఎంత గాఢంగా ప్రేమించేవాడంటే, బాబా తన గురువు అనే భావాన్ని కూడా రానీయక, సర్వమూ బాబాయే! బాబాతోటిదే యీ జగత్తు. ఆయన సర్వాంతర్యామి, అనే భావంతో ఆ ప్రేమలో లీనమై పోయేవాడు. ఈ సృష్టిలో తానొక కీటకం వంటివాడివని, సృష్టికర్త ముందు మోకరిల్లి, తన జన్మ ధన్యత చెందుటకు, మోక్ష ప్రాప్తి తప్ప మరేం కావాలని ఊహిస్తూ ఉండేవాడు. బాబా సన్నిధిలోనే ఉంటూ సేవలు చేసేవాడు. ఆయన్ని చూడకుండా క్షణం కూడా వదిలి ఉండేవాడు కాదు.

అలా ఉండగా, ఒకసారి బాబా పాశ్చాత్య పర్యటనకై విదేశీ ప్రయాణం చేయాల్సి వచ్చింది. కొద్దిమంది శిష్యుల్ని వెంట పెట్టుకొని వెళ్ళారు. తక్కిన వారందరిని ఆశ్రమంలో ఉండమన్నారు. అలా ఆశ్రమంలో ఉన్నవారిలో ఈ శిష్యుడు కూడా మిగిలాడు. బాబా ఎడబాటును సహించలేక దుఃఖించ సాగాడు. బాబా బొంబాయి వెళ్ళి శాంతా క్రూజ్ విమానాశ్రయంలో విమానరాకకు ఎదురు చూస్తున్నారు. మెహెర్ పరివార మంతా బాబాకు వీడ్కోలు చెప్పుటకు విమానాశ్రయానికి వచ్చారు. విమా

నము రాగానే, ఎక్కుతూ బాబా మెట్లపై నిలబడ్డారు. బాబా ప్రేమికులంతా బారులుతీరి వీడ్కోలు పలుకుతున్నారు. పై శిష్యుడు మాత్రం, తనకేమీ పట్టనట్లు దుఃఖిస్తూ అందరిలోకంటే చివరలో నిలబడి వున్నాడు. తనకు కావలసింది, బాబా కడసారి దర్శనము మాత్రమే కనుక, తనకు దూర మవుతున్న తన ప్రియతముడు తనకేదయినా అంతిమ సందేశాన్నిస్తే, భౌతికంగా తమ మధ్య ఎదురవుతున్న ఎడబాటుకు ఊరడింపు లభిస్తుం దని, ఆవేదనతో ఎదురు చూచాడు.

తనకు వీడ్కోలు చెపుతూ అంతమంది నిలబడినా, బాబా దృష్టి చిట్ట చివర్లో నిరాశక్తతో నిలబడిన పై శిష్యుని హృదయ ఫలకంపై ఉన్న ఆకాంక్షను చదివినట్లున్నారు చిరునవ్వుతో అతనిని పలకరిస్తూ సౌంజ్ఞలు చేశారు. "నీవు దుఃఖించవద్దు!" అని ఎప్పుడయితే బాబా దుఃఖించవద్దని ఆదేశించారో ఆ మరుక్షణంలోనే దానిని దైవాజ్ఞగా తీసుకొని, తన దుఃఖాన్ని దిగమింగాడు. బాబా విమానంలోనికి వెళ్ళేవరకూ ఆయన్నే చూస్తూ నిలబడ్డాడు. అప్పుడతనికి జ్ఞానోదయమైంది. మనం బాబాను ఎంత గాఢంగా ప్రేమిస్తే ఆయన మనకు అంత సమీపంగా ఉంటారని— మనం ఏమి చేస్తే ఆయనా అదే చేస్తారు కనుక, ఆయన వ్యథననుభవించు విధంగా మనం ప్రవర్తించకూడదని తెలుసుకున్నాడు.

బాబాకు ఏమీ భారం కాకుండా ఉండాలంటే మనం నిత్యం సంతో షంగా ఉండాలి. అందుకే బాబా "విచారించకు సుఖంగా ఉండు" అని తరచూ చెప్పేవారు. "నన్ను ప్రేమించు- నేను నీ అవసరాల్ని చూచు కుంటాను. నన్నేమియు కోరకు" అంటూ హెచ్చరించుటలో మనం తెలుసుకోవాల్సిన గూఢార్థం ఒకటున్నది. సర్వము పరిత్యజించి, బాబాకు సర్వార్పణ అయినప్పటికీ, నిర్విచారంతో బాబా శరణుజొచ్చి ఆయన్ని సంతోషపెట్ట కలగాలి, ప్రేమఅనేది భగవంతుడు మానవునికి ప్రసాదించే వరం, విధేయత ఒక సద్గురువు మానవునికి ఇచ్చే బహుమతి. సమర్పణ మానవుడు తన గురువునకు అర్పించుకునే మహాప్రసాదం. ప్రేమించేవాడు ప్రియతమునికి ప్రేమికుడు. విధేయుడయినవాడు ప్రియతమునికి ప్రియత

ముడు. తను, మన, ధన సర్వస్వాన్ని త్యజించినవాడు, ప్రియతమునిలో తానై ఉంటాడు. తానే ప్రియతమునిగా భాసిస్తాడు. అందువల్ల ప్రేమ కంటే విధేయత గొప్పది. విధేయతకంటే సమర్పణ గొప్పది. అయితే ఈ మూడింటిని సమన్వయపరిస్తే అన్వయమయ్యే ఏకైక పదం— "ప్రేమ దైవం."

ఈ ప్రేమను గురించి బాబా ఎంతో చెప్పారు. "వేదాంత పరంగా కాకుండా మీరు ప్రేమను ఆరాధించండి. నన్ను ప్రేమించాల్సిన రీతిలో మీలో ఏ ఒక్కరు ప్రేమించుటలేదు. నన్ను మీరంతా అలా ప్రేమించి ఉంటే, తప్పక భగవత్ సాక్షాత్కారాన్ని పొంది ఉండేవారు. శాశ్వతము, అనంతమునయిన సత్యము ఏదయితే ఉన్నదో ఆ ఏకైక అనంత తత్వముగా మనమంతా మారి ఉండేవారము. మీరు నన్ను దైవంగాను మానవుడిగాను అంగీకరించకండి. అయితే అలా అంగీకరించినప్పటికి మీరు నన్ను, నన్నుగా తెలుసుకోలేరు. నేనెవరినో మీరు తెలుసుకోవాలంటే, నా నిజ స్థితిని తెలుసుకో గల చైతన్యాన్ని మీరు పొందాలి. ఆ చైతన్యాన్ని మీరు పొందాలంటే, నేను మిమ్ములను ఎంతగా ప్రేమిస్తున్నానో అంతగా మీరు నన్ను ప్రేమించాలి. ప్రేమికునికి, ప్రియతమునికి మధ్యన ఉన్న తెరను ప్రేమ మాత్రమే తొలగించగలదు. నన్ను మీరు విశ్వసించండి. మీకూ నాకూ మధ్య విభజనను చేస్తున్నది మీలోని "అహం" అనే తెరమాత్రమే!"

"నీవు- నీ అహంకారము అంటే ఏమిటి? మీకు బాగా ఆకలివేసినప్పుడు "నాకు ఆకలి అవుతోంది" అంటారు. అనారోగ్యంతో ఉంటే, "నాకు వంట్లో బాగాలేదు" అంటారు. "బాబా! నేనీ రోజు బాగా నిద్రపోయాను—నేను సుఖంగా ఉన్నాను— నాకొడుకు మరణించాడు— నన్ను వారు తిట్టారు—నేను బాధపడ్డాను— ఇవన్నీ నా వస్తువులు— అంటూ ఉంటారు. ఈ "నేను" "నాది" "నా యొక్క" అనేవే అడ్డు తెరలు....ఈ అడ్డు తెరతొలగిపోవాలంటే ముందుగా సర్వార్పణమై నా చరణ సన్నిధిలో ధూళిగా మారి, అంతగా నన్ను ప్రేమించాలి. అలా

నన్ను గాఢంగా ప్రేమించి, నన్ను పొందాలంటే, ఈ కాల చక్రంలో ఎన్నో యుగాలు, జనన మరణ చక్ర భ్రమణం జరగాలి. ఎవరైనా భగవత్సాక్షాత్కారాన్ని పొందాలంటే, కొన్ని వందల వేల సంవత్సరాలు పడతాయి."

"పూజా పునస్కారాలుగానీ, యజ్ఞయాగాదులుగానీ, ధ్యానము, తపస్సు, ఆరాధనవంటి వేవీ మానవాళిలో ప్రేమను రగుల్కొలపలేవు. ప్రేమ అనుభవించుటకేగాని, ఇతరులకు చెప్పేది కాదు. నన్ను అధికాధికముగా ప్రేమించుట మీ కర్తవ్యము. నేను ప్రేమ మహాసాగరుడను. నా ప్రేమను మీకు పంచి, మీరు ప్రేమించునట్లు చేయుటకే నేను వచ్చాను. సదా నన్నే మీరు స్మరిస్తుంటే ఇతరుల బలహీనతల గురించి ఆలోచించవలసిన అవసరం మీకురాదు" అంటూ బాబా ఎన్నో నిత్య సత్యాల్ని ప్రవచించారు. ఇవన్నీ నోటి మాటలతో కాక, ఆచరణాత్మకంగా ప్రబోధించారు. ఆయన ప్రేమకు అర్హులైన వారికి ఈ జన్మలోనే మోక్షాన్ని పొందే అనుగ్రహాన్ని ప్రసాదిస్తానన్నది బాబా అభయం.

1954లో బాబా ఆంధ్రా టూరుకు ముందు హమీర్‌పూర్ ప్రాంతములో పర్యటించారు. ధనోరీ అనే గ్రామంలో ఆయన దర్శన కార్యక్రమం జరుగుతోంది. దాదాపు 7000 మంది పాల్గొన్నారు. ప్రతివారికి బాబా స్వయంగా ప్రసాదాన్నందిస్తున్నారు. క్యూలో వున్న చాలా మందిలో ఒక అందమైన అంధ బాలుడు బాబా దర్శన స్పర్శ భాగ్యం పొందేందుకు నిలబడ్డాడు. తన వంతురాగానే బాబాకు ప్రణమిల్లి ప్రసాదాన్ని తీసుకోగానే, కార్యకర్తలు అతడ్ని పక్కకు నెట్టివేశారు. తరువాత వారికి బోధిస్తూ అది గమనించిన స్కో ఎరుచ్, తనలో ఇలా చింతించాడు. ఆరోగ్యవంతుడైన ఇంత అందమైన బాలుడు గుడ్డివాడైతే బాబా ఎంత నిర్దయుడయ్యారు? అతడ్ని గురించి ఎందుకు పట్టించుకోలేదు?" అనుకున్నాడు.

దర్శన కార్యక్రమంతాగానే బాబా తన మండలితో పాటు కారులో మరో గ్రామానికి బయలుదేరారు. దారిలో కారునాపి, ఒక చెట్టు క్రింద

నిలబడ్డారు. మండలి అంతా ఆయన చుట్టూ నిలబడ్డారు. బాబా సౌంజ్ఞలు చేస్తూ "ఈ నాడు పరమాత్మ ఎంతో దయాళుడై ప్రసన్నుడయ్యాడు. నేనా అంధబాలునికి దృష్టిని ప్రసాదించి ఉంటే అతడికి చాలా అపకారం జరిగేది. పరమాత్మే అతడికి దృష్టినివ్వకుండా నన్ను అడ్డుకున్నాడు" అని వివరించారు. అది విన్న మండలి వారంతా, బాబాయే పరమాత్మ అయినప్పుడు, మరింకెవరో పరమాత్మగా అంటారేమిటి? అని తలపోస్తున్నంతలోనే బాబా కల్పించుకొని, ఆ బాలుడు తన సంస్కారాలను తాను అనుభవిస్తూ, నా చెంతకు వచ్చి నా స్పర్శ భాగ్యం పొందుటవల్ల, కర్మ పరిపక్వత జరిగి యీ జన్మలోనే మోక్షాన్ని పొందే అదృష్టాన్ని సాధించాడని వివరించారు.

మెహెర్‌బాబా జీవితంలో మరో అద్భుతఘట్టం నవజీవనం. ఐశ్వర్యంతో భోగభాగ్యాలతో తులతూగుటకు అలవాటు పడిన వారిని సైతం, భౌతిక సంపదలకు అతీతులను చేసి, బాహ్యవిషయాలపై తమదృష్టిని కేంద్రీకరించకుండా, నిరంతరం ప్రభునామస్మరణతో గడపగలిగే పరివ్రాజక జీవితాన్ని గడిపే తర్ఫీదు ఇచ్చిన ఘట్టమది. గతాన్ని పూర్తిగా విస్మరించి, వర్తమాన మందే జీవిస్తూ, భవిష్యత్తుని గురించి ఆలోచించక, గడిపిన ఘట్టం. 16 అక్టోబరు 1949న ఇది ప్రారంభించబడింది. సాధారణ మానవ వాలనడుపుతూ, భగవదన్వేషిగా సహోదరునిగా వ్యవహరిస్తూ మెహెర్‌బాబా తన నవజీవన కాలంలో సంపూర్ణ బాహ్యపరిత్యాగమనే జీవనాన్ని గడిపారు రామావతారంలో వనవాస జీవితము ఎటువంటి ప్రాశస్త్యాన్ని పొందినదో, మెహెర్‌బాబా గడిపిన యీ నవజీవనం కూడ అంతటి మహత్యాన్ని అందించింది. ఎన్నికష్టాలెదురైనప్పటికీ, నిరాశమయ, నిస్సహాయ జీవనాన్ని అలవడేట్లు తన శిష్యులతో గడిపిన పరివ్రాజకజీవితమది. గడగడలాడించే చలిలో సైతం, ఏ ఆచ్ఛాదన లేకుండా ఆరుబయట పడుకొనుట, గోచిపాత ధరించిన బలాఢ్యులైన విద్యాధికులగు శిష్యులచేత, "అమ్మా! మాధాకవళం!" అంటూ భిక్షాటన చేయించుట,

మైళ్ళ కొద్ది కాలినడకన పయనించుట వంటి సంఘటనలు గుర్తుచేసు కుంటే వళ్ళు గగుర్పొడుస్తుంది.

బాబా తన పూర్వ జీవనంలో భగవదవస్థానంతో ఉండి, పరిపూర్ణ దైవత్వాన్ని కలిగి ఉన్నారు. అయితే తన నవ జీవన కాలంలో తన ఈశ్వరావస్థానం నుండి, మానవ స్థాయికి దిగి వచ్చి, తాను పెద్దన్నయ్యగా గడుపుతూ, తన సహచరులు గురుశిష్య సంబంధాన్ని మరిచిపోయేలా చేశారు. నవజీవన మంటే, ప్రాపంచిక వ్యవహారాల్లో తన విద్యుక్త ధర్మాల్ని విడిచిపెట్టి, బాధ్యతల్ని వదులుకోవ టంకాదు. అది క్రమశిక్షణతో కూడిన జీవితం. నిష్కపటం, ప్రేమ, విధేయతలు నవజీవనంలో ముఖ్యలక్షణాలు. 16 ఫిబ్రవరి 1952 వరకూ నవజీవన కొనసాగింది. ఈ జీవితం కొత్తదైనప్పటికీ జీవుడు మాత్రం పాతవాడే. ఆ నాడు ఆయన గడిపిన నవజీవనం ద్వారా మనకు అవసర మైన శిక్షణ నందించారు. బాబా తన శరీరాన్ని త్యజించినా, ఆయన ఇంకా ఆయనగానే మిగిలి ఉన్నారు. కనుక ఇప్పుడు ఆయన ప్రక్కనే ఉండుట మన వంతైంది. అశాశ్వతమైన బంధాల్ని మనస్సు నుండి పారదోలితే భగవంతుడ్ని స్మరించుట సులభమని తాను ఆచరించి చూపారు. బాబా ఇచ్చే శిక్షణ, మనస్సుకు బోధలు చేసి నేర్పటం కాదు. నిర్మొహమాటంగా తన అభిప్రాయాల్ని వ్యక్తపరచకుండా, హృదయంతోనో పనిచేయటం బాబా పని.

ఒక సారి బాబా జన్మదిన కార్యక్రమం మెహెరాబాదులో జరుపు టకు ఏర్పాట్లు జరిగాయి. ఆరంగాం ప్రజల్ని తెచ్చి పాదాభిషేకం చేయుటకు అనుమతించారు. ఆ కార్య క్రమంలో పాల్గొనుటకు పరిమిత సంఖ్యలో అనుమతించారు. బాబాపై వున్న ప్రేమతో ఆరంగాం గ్రామ స్తులు కావళ్ళతో టోకా అనే ఊరు వద్ద ఉన్న గోదావరి నదికి నడిచివెళ్ళి రోజులు తరబడి గోదావరి నీటిని మోస్తూ తెచ్చారు. భోజన సమయంలో, విరామ సమయంలో, రాత్రి సమయంలో గోదావరి జలాలతో నిండిన

పాత్రలున్న కావిడిని నేలపై ఉంచక, అత్యంత భక్తి శ్రద్ధలతో చెట్ల కొమ్మలపై వ్రేలాడదీసి మెహెరాబాదుకు చేర్చారు.

బాబా మెహెరాబాదు నుంచి పొద్దుటే మెహెరాబాదుకు వచ్చి రాగానే, అరంగాం గ్రామస్తులు తెచ్చిన పవిత్ర గోదావరి జలాలతో అవతారుని దివ్య పాదారవిందాలకు అభిషేకం చేశారు. నిర్మలమైన వారి ప్రేమకు మెహెర్‌బాబా ఎంతో ముగ్ధులయ్యారు. ప్రియతముని దర్శన కార్యక్రమం జరుగుతుండగా అరంగాం గ్రామస్తులు భజనలు, పాటలతో బాబాను ఆనందపరవశుల్ని చేశారు. సరిగ్గా అదే సమయంలో, హమీర్ పూర్ నుంచి, ఒక బాబా ప్రేమికుడు, బాబా అనుమతి లేకుండా, దర్శన కార్యక్రమంలో పాల్గొని బాబా పాదముల చెంత సాష్టాంగ దండప్రణామములా చరించి, అచేతనంగా చాలా సేపు పడిపోయాడు. ఈ హఠాత్పరిణామంతో దర్శన కార్యక్రమం ఆగిపోయింది. అంతట బాబా తన దగ్గరున్న శిష్యుడిని ఒకరిని పిలిచి, అలా సాష్టాంగపడియున్న ఆ ప్రేమికుడు బ్రతికి వున్నాడో, మరణించాడో చూడమని ఆదేశించారు. దానిని గ్రహించిన ఆ యువకుడు వెంటనే లేచినిలబడ్డాడు.

బాబా ఆ ప్రేమికుడ్ని నా అనుమతి లేకుండా నా ఆజ్ఞను ఉల్లంఘించి ఎందుకు వచ్చావని అడిగారు. బాబా! అనుమతి లేకుండా రాకూడదని మీరిచ్చే ఆదేశాలు నాకు తెలియదు. మీ జన్మదినంలో స్వయంగా పాల్గొని మీ దర్శనం చేసుకోవాలన్న ఆకాంక్షతో వచ్చాను" అని బదులిచ్చాడు. అతని హృదయ లోతుల్లో పాదుకున్న భక్తికి బాబా ముగ్ధులై అతడ్ని అనుగ్రహించి, ఆలింగనమిచ్చి వెంటనే తిరిగి వెళ్ళిపొమ్మని ఆదేశించారు. అమితానందములతో అతడు వెనుతిరిగాడు. తన విద్యుక్త ధర్మాల్ని నిర్వర్తిస్తూనే మనస్సును మాత్రం, దైవంపై లగ్నం చేసుకొనుటను యీ సంఘటన మనకు నేర్పుతుంది. మనస్సు నుండి వెలువడే మానసిక సంక్షోభాన్ని భరించటం ముఖ్యం.

నవ జీవనాన్ని రెండు సంవత్సరాలపాటు నిరాఘంటంగా కొన సాగింది. ఆ పిమ్మట నాలుగు నెలలపాటు అమనస్కయోగం (మనో నాశ్) అనే మరో కార్యక్రమాన్ని చేపట్టారు. ప్రపంచాన్ని సృష్టించే మనస్సును శాశనపరిచి నాశనం చేయుటను మనోనాశ్ అంటారు. మత పరమైన సాంప్రదాయాలను, కర్మకాండలను, అరిషడ్వర్గాలతో సహా భగ వత్త్వమాగ్నిలో భస్మీపటలం కావించి,మనస్సుకి జ్ఞానానుభవాన్ని కలిగించుట యీ మనోనాశ కార్యక్రమ విధానం. 16 అక్టోబరు 1952న హైదరాబాదు కొజ్జాగూడ దగ్గరున్న కొండపై మనోనాశ్ ఘట్టాన్ని ప్రారంభించారు. 1952 జనవరి 31న మెహెరాబాదుకు చేరుకొని, ధునిని వెలిగించుటద్వారా జ్వాలతో అంతమైనది. "ప్రపంచంలోని అన్ని మతాల వారు ఆచరించే కర్మకాండలు, పూజా పునస్కారాలు, సాంప్రదాయాలు ఈ నాడీ అగ్ని గుండంలో ఆహుతి చేయబడినవని ఒక చీటీపై వ్రాయించి, ఎరుచ్‌తో బిగ్గరగా చదివించి, బాబా స్వయంగా ఆ చీటీని ముక్కలుగా చించిమండు తున్న ధునిలో కాల్చి వేశారు. ధునిలోని సమిధలన్నీ బూడిదైన తర్వాత, దాని నెవరూ తాకవద్దని ఆదేశించి, డబ్బాలలో ఉంచి సీలు చేయించారు. ఆ డబ్బాలిప్పటికీ భద్రపరచబడి యున్నవి.

ఇదంతా దైవలీల. మెహెర్‌బాబా జగన్నాటక సూత్రధారి. ఆయన చేతలు మనకు శిరోధార్యాలే కాని, వాటి లోతులను, మనము అర్థం చేసు కోలేము. సర్వోన్నతుడైన భగవంతుడు హీనమైన యాచకుడయ్యాడంటే, యీ విశ్వంలో బానిస బ్రతుకులు బతుకుతున్న వారెందరినో ఉద్ధరించు టకేనని గ్రహించాలి. నవ జీవన కాలంలో బాబా నిర్వహించిన పనియొక్క ఫలితం కనపడుటకు, 1952 ఏప్రియల్ 18న అమెరికా వెళ్ళి ఏకాంత వాసంలో చిక్కులతో కూడిన, "జటిలమైన స్వేచ్ఛా జీవితము" మరియు "సంపూర్ణ స్వేచ్ఛా జీవితం" అనే రెండు ఘట్టాల్ని పూర్తి చేసుకొని అదే సంవత్సరం ఆగష్టు 21 నాటికి బొంబాయికి తిరిగి వచ్చారు. ఈ జటిలమైన స్వేచ్ఛా జీవిత కాలంలోనే బాబాకు అమెరికాలో కారు ప్రమాదం జరిగి, కుడి వైపు అవయవాలన్నీ విరిగిపోయాయి.

ఈ రెండు రకాల ఘట్టాల్ని సమైక్యపరచి 1952 నవంబరు 15 నుంచి "జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితం" అనే పేరుతో ఆఖరి ఘట్టాన్ని ప్రారంభించి, భారతావని నలుమూలలా మూడు నెలలపాటు తిరిగి పూర్తి చేశారు. దారిలో దరిద్ర నారాయణ సేవలో పాల్గొన్నారు. ఈ జ్యోతిర్మయ జీవిత ఘట్టంలోనే "పశ్చాత్తాప ప్రార్థన", "పర్వర్దిగార్ ప్రార్థన" "సర్వోన్నతుడు" అనే సందేశాల్ని ప్రపంచానికందించారు. ఉద్భృతమైన యీ నవ జీవ ఘట్టాలన్నీ పూర్తయ్యాక ప్రాక్పశ్చిమ దేశాల్లో ఒక దశాబ్దం పాటు ఎనలేని పర్యటనలను చేసి, ప్రజా బాహుళ్యంతో సన్నిహితంగా గడిపారు.

"సామాన్య మానవుడు తన కొరకు బాధపడతాడు. గురువులు మానవాళి కొరకు బాధపడతారు. కానీ అవతారుడు మాత్రం, ప్రతివారి కొరకు, ప్రతిదాని కొరకు బాధల్ని అనుభవిస్తాడు" అన్నది బాబా ప్రవచించిన సూక్తి. దీనికి నిదర్శనంగానే, 1956 డిశంబరు 2న బాబా తన శిష్యులు ఎరుచ్, పెండూ, విష్ణూ, నీలూలతో కలిసి ఒక కారులో పూనా నుండి సతారాకు బయలుదేరారు. ఎరుచ్ కారును నడుపుతున్నాడు. డ్రైవింగ్‌లో మంచి అనుభవమున్న వాడే! దారిలో ఏ అడ్డంకీ ఎదురవ్వకుండానే, ఊహకందని రీతిలో అదుపు తప్పి రోడ్డు పక్కనున్న అడుగు లోతన్నాలేని ఒక గుంటలోకి దొర్లి పెద్ద ప్రమాదం జరిగింది. బాబాకు ఎడమ వైపు అవయవాలన్నీ దెబ్బలని ఎడమకాలు విరిగింది. నలుగురు శిష్యులు తీవ్రంగానే గాయపడ్డారు. అంతా కనురెప్పపాటులో జరిగిపోయి, డా॥నీలూ కోరుకున్నట్లు తన ప్రియతముని సన్నిధిలో ప్రాణాలు కోల్పోయాడు. రెండు ప్రమాదాల అనంతరం, బాబా శారీరకంగా చాలా బాధల్ని అనుభవించారు.

బాబా తరచూ "మీరు నాకు విధేయులుగా ఉండుట, మీ ధర్మం. చిట్ట చివర వరకూ మీరు నాకు విధేయులుగా ఉండుట మీ కర్తవ్యం. మీ మనస్సు మీపై అనేక ట్రిక్కులు ప్రయోగిస్తుంది. మనస్సు, ఏం చేసినా

ఫరవాలేదు. ఎటువంటి కోరికలైనా రానీయండి. ఏ భయాలైనా కలగ నీయండి. అస్తవ్యస్త పరిస్థితులెన్ని ఎదురైనా, మీరు నా ఆదేశాల్ని విధే యతతో ఆచరించిన ఫలితంగా నీ కొంగును గట్టిగా పట్టుకోగలుగుతారు. అందువల్ల ఎట్టి పరిస్థితులలోనైనా నాకు విధేయులై యుండుడ"ని హెచ్చ రించారు. నిస్వార్థ సేవ యధార్ధ త్యాగం అందరికీ అందుబాటులో ఉండేవే అయినప్పటికే ఆచరణలో మాత్రం, నిజమైన ప్రేమికులే ఆచరించే వీలు న్నది. సేవ ప్రతి వారూ చేస్తారు, ఫలిత మాసించకుండా చేసే బాబా సేవే నిజమైనసేవ అవుతుంది. ఆ సేవ వెనుక స్వార్థ రహితతి తీక్ష, సంపూర్ణ విధేయతలు మాత్రమే ఉంటాయి.

1963-64లో బీహారులో విపరీతమైన కరువు వచ్చింది. అనేకమంది కరువుకు బలైపోతున్నారు. రోజూ పేపర్లన్నీ ప్రళయ తాండవం చేస్తున్న కరువును గురించి, ప్రచురిస్తున్నాయి. ఒక రోజున ఒక వార్తాపత్రికలో ప్రముఖ పారిశ్రామికవేత్త ఒకరు కరువు ప్రాంతంలో అనేకచోట్ల లెక్క లేనంతమందికి నిత్యం అన్నదానం చేస్తున్నట్లు ప్రచురించారు. భాఊ కల్సారా అనే శిష్యుడు ఆ వార్తను చదివి, అతని సేవా తత్పరతకు ముగ్ధుడై తన సంపదనంతటిని ఒక సత్కార్యానికి వినియోగిస్తున్నాడు కదా! ఎంతటి అదృష్టవంతుడో కదా! అనుకున్నాడు.

రాత్రికి బాబాకు కాపాలదారుగా వెళ్ళి ఆయన దగ్గర ఉన్నాడు. బాబా అతడ్ని దగ్గరకు పిలిచి పాదాలు వత్తమని ఆదేశించారు. అలా వత్తు తుండగా అతనికి ఉదయం పేపర్లో చదివిన పారిశ్రామికవేత్త సేవా తత్ప రత గుర్తుకు వచ్చింది. నిజంగా ఆ పారిశ్రామికవేత్త ఎంతో నిస్వార్థం సేవ చేస్తున్నాడు. అతడికి భగవంతుడు కూడా చాలినంత భాగ్యాన్ని ప్రసా దించాడు. సంపాదించిన ద్రవ్యాన్ని సద్వినియోగపరిచి ఎందరి ప్రాణాలనో రక్షిస్తున్నాడు. కానీ యిక్కడ మేము ఏమీ సహాయపడలేకపోతున్నాము అతనిలా మేమెవరికి సహాయపడలేకపోతున్నాము కదా! అని ఆలోచిస్తు న్నాడు. అంతలో బాబా ఏమిటి, ఆలోచిస్తున్నావు?" అనడిగారు. మర

ప్పుడు బాబుకు నిజం చెప్పక తప్పలేదు "నేను బీహారులోని కరువు గురించి ఆలోచిస్తున్నాను" అని చెప్పేశాడు. ఏమీ ఎరగనట్లు ఇప్పుడక్కడ ఏమైంది? అని ప్రశ్నించారు.

బాబా ప్రజలు ఆకలితో మరణిస్తుంటే భాగ్యవంతుడైన ఒక ప్రముఖ పారిశ్రామికవేత్త, ఉచితంగా భోజన వసతులు కలుగచేస్తున్నాడట. అన్నార్తులకు ఆహారాన్నందించి ఉచితంగా నిస్వార్థ సేవ చేస్తున్నాడు" అని చెప్పాను. "నిస్వార్థ సేవా? కాదు, అతడు అత్యంత స్వార్థపూరితమైన సేవ చేస్తున్నాడు" అని బాబా అన్నారు. "అదేమిటి బాబా! స్వార్థమా? అదెలా స్వార్థమవుతుంది? నిజానికతను ఒక మంచి పనే కదా చేస్తున్నాడు?" అన్నాను.

"అవును. అతను మంచి పనే చేస్తున్నాడు. కాని దాని ధ్యేయం మాత్రం స్వార్థం. అతడా పనిని ఎందుకు చేస్తున్నాడో మీకు తెలుసా! పేరు ప్రఖ్యాతులు పొందటం అతని ధ్యేయం. అలాంటి మరిన్ని దాన ధర్మాలు చేయుటవల్ల ఆదాయపు పన్నులో మినహాయింపు వస్తుంది. ఇలా అతడి ధ్యేయాలన్నీ స్వార్థపూరితాలే! నీవు నా దగ్గరున్నావు. నాకు అమూల్యమైన సేవ చేస్తున్నావు. నాకు సేవ చేయుటలో నీవు ఈ విశ్వానికే సేవ చేస్తున్న వాడివయ్యావు. ఎందుకంటే సకల ప్రపంచం నాలోనే ఉన్నది. ఒకవేళ ఆ పెద్ద మనిషి స్వార్థరహితుడైననప్పటికీ అతను తన ధనంతో ఈ విశ్వమంతటికీ సేవచేయలేడు. అతనెన్ని మంచి కార్యములు చేసినా బంధితుడవుతున్నాడు. నా ద్వారా నీవు సకల ప్రపంచానికి సేవ చేస్తున్న వాడవవుతున్నావు. అలాకాక అతను అత్యంత స్వార్థపూరిత సేవ చేస్తున్నాడు. నా నుండి ఎటువంటి ఫలితాన్ని ఆశించకుండా నీవు చేస్తున్న సేవని స్వార్థసేవకాని అతను చేసేదికాదు" అని బాబా సేవా ధర్మం గురించి ప్రబోధించారు.

"మంచి విశ్వాసంతో దైవాన్ని నమ్మండి! ఆయనపై నమ్మకము నుంచి, ఆయన ఇచ్ఛకు విధేయులైతే మీ కష్టాలన్నిటినీ ఆయనే పరిష్క-

రిస్తాడని బాబా ప్రవచించారు. ప్రేమకోసరం మన సమస్తాన్ని త్యాగం చేయాలి. అప్పుడా ప్రేమే మనల్ని మన ప్రియతముని దగ్గరకు చేరుస్తుంది. ఆయన కృప ఉండేనే అది సాధ్యపడుతుంది. ఏకాగ్రతతో ఇష్టదైవాన్ని మనసా, వాచా, కర్మణా దృష్టిలో వుంచుకొని సర్వార్పణ కావాలి. మెహెర్‌బాబా ప్రేమకు ప్రతీక. ఆయన్ని ఆరాధించేవారికి తన ప్రేమనందించి. తనకు ప్రేమించవలసిన రీతిలో ప్రేమించేటట్లు చేశారు.

బాబా సన్నిహిత మండలిలో మణిషెరియార్ ఇరానీ సేవకు ప్రతీక. సేవాధర్మాన్ని పాటించుటలో ఆమెకు ఆమే సాటి. మెహెర్ బాబాకు మణి స్వంత చెల్లెలే అయినా మణి మాత్రం ఆయన్ని దేవుడన్న ట్యగా భక్తితో సేవించింది. నరనరానా బాబా నామాన్ని జీర్ణించుకున్న ధన్యురాలు· ఒకరోజున మెహెరాబాదులోని బాబా గదిలో మణి బాబాను కలుసుకున్నది. ఏదో వ్యక్తిగతమైన కుటుంబ విషయాలు బాబా దగ్గర ప్రస్తావించి ఆయనతో ఘర్షణపడి, కుపితయై బావురుమని ఏడ్చేసింది. భావూ కల్చూరీ అనే శిష్యుడు గుమ్మంలో కావలి వున్నాడు. మణి ఏడుపు స్వయంగా వింటున్నాడు. అలా ఎక్కి ఎక్కి ఏడుస్తున్న మణికి బాబా సౌంజ్ఞలతో ఏదో సందేశాన్నందించి, ఎరుచ్‌కి వప్పగించి రమ్మని ఆదేశంచారు. అంతవరకూ ఏడుస్తున్న మణి తన దుఃఖాన్ని నిగ్రహించుకొని, చిరునవ్వు తెచ్చుకొని, నవ్వు ముఖంతో ఎరుచ్ గదికి వెళుతున్న మణిని చూచి భావూకల్చూరి ఆశ్చర్యపోయాను అంటూ దుఃఖాన్ని, ఆనందాన్ని రెంటినీ ఏకకాలంలో అనుభవించే అద్భుతశక్తి సర్వార్పణ అయిన మణి లాంటివారికే చెల్లుతుందని అంటాడు·

మెహెర్‌బాబా 44 యేళ్ళు అఖండమౌనాన్ని పాటించారు కనుక నిజానికాయన పలకడు. అయితే ఆయన కళ్ళు మాట్లాడేని· అందమయిన ఆయన చేతివేళ్ళు అక్షర ఫలకంపై పరుగులిడుతుంటే, సౌంజ్ఞలతో ఆయన వేళ్ళు కదలాడుతుంటే, మారే ఆయన ముఖకవళికలు, హావభావాలు

చూస్తుంటే ఆయన పెదవులు కదలాడకపోయినా చూచేవారికి ఆయన మాట్లాడుతున్నట్లే అనిపించేది. ప్రతి కదలిక ఆయన అనురాగాన్ని,ఆప్యాయతను ప్రస్ఫుటంగా ప్రతిఫలింపచేసేది. మొట్టమొదటిసారి బాబా దర్శనానికి వచ్చినవారు సైతం, తన స్వంత కుటుంబపెద్దను కలుసుకున్నంత స్వేచ్ఛగా ప్రభావితులయ్యేవారు. భగవంతునియందు ప్రేమలేని వారికి, విషయ భోగములపై మక్కువ ఎక్కువ వుంటుంది. అందువల్ల అట్టివారికి విషయ వాంఛలయందు విరక్తి కలిగించి ఆ భోగాలకు అతీతులను చేయుటయే ఆయన చేసిన విశ్వకార్యక్రమము. ఆయన్ననుసరించే శిష్యులందరికీ తన శాశ్వత అనుచరులుగా మారేందుకే కార్యక్రమాలన్నీ ఎంతో ఉపయోగపడ్డాయి.

జీవితముయొక్క పరమావధి ఆధ్యాత్మిక సాధన. మనము పొందవలసిన గమ్యస్థానము భగవంతునిలో ఐక్యము కావటము. గమ్యసాధనలో తన అనుచరులకు సహాయపడుటలో తరచు ఏకాంతవాసములు, ఉపవాసములు చేయుటవల్ల మెహెర్‌బాబా ఆరోగ్యం క్షీణించసాగింది. ఉత్తరాల ద్వారా కలుసుకోవటంకూడా ఆగిపోవటంతో బాబా ప్రేమికులలో నిరుత్సాహం చోటుచేసుకున్నది. 1959-1968 దశకం అత్యధికభాగము ఏకాంతవాసంతో గడిచిపోయింది. ఆంతకుముందే తన ప్రజాదర్శనల గురించి బాబా వివరిస్తూ, తన బాహ్యాపరమైన స్పర్శ క్రియలన్నీ అంతర్ స్పర్శ సంబంధాన్ని స్థాపించుటకై నిర్వహించబడినవి. ఆ అంతర్ సంబంధ గొలుసులో బద్ధులై యుండవలసిన సమయమాసన్నమైనందున బాహ్యస్పర్శ సంబంధ కార్యక్రమాలతో మరెంతమాత్రం పని లేదు అని వివరించారు. అందుకే బాబా జీవితంలో తుది దశకమంతా ఎవరినీ సంద సందర్శించుటకు అనుమతించలేదు. కఠోరమైన ఆయన ఏకాంతవాసము, ఆధ్యాత్మికంగా మానవాళికెంతో ఉపకరించింది.

బాబా మండలితో బెంగుళూరులో ఉంటున్నప్పుడు యిటువంటి అంతరంగ స్పర్శకు సంబంధించిన సంఘటన జరిగింది. ఒకరోజున

నిరక్షరాశ్యుడయిన ఒక బాలుడు బాబావద్దకు వచ్చి, బాబా ఆశీస్సులు కావాలని కోరాడు. అప్పుడు బాబా "నీవేం చేస్తున్నావు? చదువుకున్నావా?" అనడిగారు. "నేనేమీ చదువుకోలేదు. అయితే రోజూ పేకాట ఆడుట నా అలవాటు. ఎప్పుడూ ఆటలో నష్టమే వస్తోంది. మా ఇంటి పక్కవాళ్ళు, దేవుడే వచ్చాడని నీగురించి చెప్పుకుంటుంటే విని రేపటి ఆటలో బాగా లాభం వచ్చేందుకు నీ ఆశీస్సులు కోరివచ్చానని" చెప్పాడు. అది విన్న బాబా తన ఆశీస్సులిచ్చానని చెప్పి, వెళ్ళిపొమ్మనారు. మర్నాడు ఆ బాలుడికి పేకాటలో బాగా లాభం వచ్చేసరికి, బాబాకు ధన్యవాదములు చెప్పుటకు మళ్ళీ వచ్చాడు. "మీ ఆశీస్సులవల్ల ఈరోజున నాకు పేకాటలో బాగా డబ్బులు వచ్చాయి కనుక, మీకు నా కృతజ్ఞతాపి వందనములు అర్పిస్తున్నాను అన్నాడు.

అప్పుడు బాబా పిల్లవాడి విశ్వాసానికి ముగ్ధులై "నీవు నావద్ద ఉంటే ఉచితంగా చదువు చెప్పిస్తాను. ఉచితంగా భోజనం పెట్టిస్తాను. మంచి బట్టలు కుట్టిస్తాను. ఉంటావా?" అని అడిగారు. "తప్పకుండా వుంటానని" తన అంగీకారాన్ని తెలుపగా రేపటినుంచి రమ్మనమని ఆదేశించారు. మరునాడు బాలకుడు రాగానే బాబా అతడి పాదాలను కడిగి తన శిరమును అతని పాదాలపై ఉంచి వందనములర్పించి కొంత పైకాన్నిచ్చారు. అన్నం పెట్టి పంపించారు, ఇలా ప్రతిరోజూ ఆ బాలుడికి ఇవన్నీ కొనసాగాయి. అంటే ఈ పిల్లవాడితో ఆయన నెలకొల్పిన సంబంధం బాహ్యంగా ఒక మానవుడు మరో మానవుడికి జరిగిన స్పర్శ సంబంధకార్యంగా కనిపించవచ్చానుకానీ దేవుడికి దేవుడికి మధ్యజరిగిన అనుబంధమది. బాబా చెప్పినట్లు "నేను మీకు ప్రణమిల్లుతున్నానంటే మీరు నాకు ప్రణామములర్పించవలసిన శ్రమ లేకుండా మిమ్ములను ఆదుకొనుటకే!" నన్న ప్రబోధము ద్వారా ఆధ్యాత్మిక లాభన్నందిస్తున్నారన్న మాట.

కొన్నాళ్ళకు ఆ బాలుడు, తనతోపాటు తన స్నేహితులు ఏడుగురిని వెంట పెట్టుకువచ్చి, వారు తనతోపాటు బాబా దగ్గర ఉంటారని

విన్నవించాడు. అందుకు బాబా అంగీకరించుటయేకాక, వారికికూడా ఆ బాలుడికి చేస్తున్నట్లే, ప్రతిరోజూ స్నానం చేయించుట, వందనమాచరించుట, భోజనం పెట్టుట, పైకానిచ్చుటవంటివిచేసి పంపుతున్నారు. అలా కొద్దిరోజులు గడిచాయి. ఒకరోజు ఆ బాలుడి స్నేహితులు బాబా వద్దకు వచ్చి, ఆ బాలునిపై ఫిర్యాదు చేశారు. "బాబా ఆ పిల్లవాడు ఈ రోజున నిన్ను తిట్టాడు" అని చెప్పారు. "ఏమీ? ఎందుకు తిట్టాడు? అసలేం జరిగిందని బాబా ప్రశ్నించగా, ఆరోజున వారంతా ఒక మామిడితోటలోకి వెళ్ళి మామిడికాయలు రాల్చే ప్రయత్నం చేసినట్లు, ఆ బాలుడు జై బాబా! అంటూ రాయితో గురిచూచి ఒక కాయను కొట్టగా అది గురితప్పి ఆకాయ పడకపోయేసరికి, అతడు సహనం కోల్పోయాడని, మళ్ళీ మళ్ళీ రాళ్ళతో మామిడికాయల్ని గురిచూచి విసురుతూ కాయరాలిపోతే జై బాబా అని, గురితప్పి రాలకపోతే, "అత్తేరి-మెహెర్‌బాబా-మేరేసాతే" అని తిట్టాడని చెప్పారు. వారు చెప్పినదంతా బాబా శ్రద్ధగా విని, అతడు నన్ను తిట్టినప్పటికీ, నా నామాన్నే స్మరించాడు కనుక నాకత్యంత ప్రియమైన వాడయ్యాడని వారిని సముదాయించి పంపారు. తన తప్పును తెలుసుకున్న ఆ బాలుడు పరమ భక్తుడయ్యాడు.

భగవంతుడు తప్పులను క్షమిస్తాడు. తప్పులను చేయుట మానవ సహజం. చేసిన తప్పులకు పశ్చాత్తాపపడుట ముఖ్యం. పశ్చాత్తాపంతో కోరే క్షమాపణ ఆయనలోని కృపను మేల్కొలుపుతుంది. అందుకే బాబా ప్రవచించారు. "నేనుచేసే మహిమ, మరణించిన వారిని బ్రతికించుటకాక భగవంతుని కొరకు జీవించేందుకు వారిని మరణించేటట్లు చేయటమే నేను చేసే మహిమ" అన్నారు. తనపై నిశ్చలమైన గట్టి నమ్మకాన్ని, అచంచల ప్రేమను పెరిగేట్లు ప్రేరణ కల్పించి తన కృపను వర్షింపచేయుట బాబా చేసిన మహత్తు. బాబా కృపను పొందాలంటే హృదయ లోతుల్లోనుండి, పెల్లుబికే తీక్షణతో ఒక్క క్షణకాలంపాటు ఆయన సన్నిధానంతో గడిపితే చాలట. ఆయన అనంత ప్రేమసాగరుడు కనుక, మనమంతా తీవ్రమైన కాంక్షలో ఆయన దర్శన భాగ్యానికై పరితపించే సమయ మాసన్నమైనది.

ఇప్పటికే ఎందరో అదృష్టవంతులు ఆ దివ్యమంగళ రూపము ప్రత్యక్ష మవుటను కన్నురాలా చూస్తున్న అనుభవాలెన్నో ప్రపంచవ్యాప్తంగా జరుగుతున్నాయి.

మెహెర్‌బాబా దివ్యదర్శనమిచ్చే సమయాల్లో వేలాదిమంది బారులుతీరి గంటలతరబడి వేచివుంటే, తమవంతు రాగానే మరుక్షణంలోనే కదలమని కార్యకర్తలు పంపేవారు. చంటిపిల్లలతో తల్లులు, పూలదండలు ప్రాసాదాలతో పురుషులు ఎన్నోగంటలు వేచివున్నా ఒక్కక్షణంలోనే పక్కకు నెట్టబడుటను చూచి స్కోఎరుచ్‌కి సందేహం కలిగింది. అదే విషయాన్ని బాబా దగ్గర ఎరుచ్ ప్రస్తావించగా "ఒక్కక్షణంపాటు నన్ను చూడగలిగితే చాలు" నన్నారు. "అదికాదు బాబా! ఎంతో ఖర్చుపెట్టుకొని ఎన్నో శ్రమలకోర్చి దూరతీరాలనుండి నీ దర్శనంకొరకు వచ్చిన వారిని మరికొంతసేపు నిన్ను చూసే అదృష్టాన్ని ప్రసాదించమ"ని వారి తరఫున వకాల్తా పుచ్చుకున్నట్లు వేడుకున్నాడు.

అప్పుడు బాబా "నేను కేవలం ఒకేచోట ఉండనిరోజు రాబోతోంది. ఆనాడు నేను వేలాది ప్రదేశాల్లో ఏకకాలంలో వ్యక్తమై, వారివారి గృహము లందే వారికి నా దర్శనభాగ్యాన్ని ప్రసాదిస్తాను. ప్రస్తుతానికి ఈ నా క్షణ దర్శనం వారికి చాలు. ఎన్నో సంవత్సరాలు నిష్ఠతో యోగ సమాధిలో గడిపిన యోగులు సైతం నా యీ క్షణ దర్శనం దొరకక పరితపిస్తు న్నారు. కనుక వారెంతో ధన్యులు" అన్నారు. అలాగే మెర్టిల్ బీచ్ సెంటర్‌లో బాబా దర్శనమిస్తున్నప్పుడు, ఆయనచుట్టూ పరివేష్టించిన ప్రేమిక సందోహం ఆనందాతిశయంతో తేలింతలాడుతూ కనిపించారు. వారికి బాబా ప్రసాదాన్ని పంచుతూ "మీ నవ్వులు, మీ ఆనందం, నాతో ఉన్నందున పొందుతున్నందున, నాకెంతో సంతోషంగా వున్నది. ఈ ప్రపంచంలో నా కొరకు అనేక వేలమంది ముముక్షువులు నా దర్శనాన్ని క్షణకాలంపాటు పొందుటకు తహతహలాడుతున్నారు. కానీ నా ఎదుణ

వున్న మీరు నిజంగా ఎంతో ధన్యులు" అన్నారు. ప్రేమద్వారా మాన వాళిలో ఏకత్వభావాన్ని పాదుకొల్పుటకు బాబా అవతరించారు కనుక, తన మౌన స్పర్శతోనే మన హృదయాల్ని మేల్కొలిపారు. అద్వితీయ ఆత్మతో, ఆత్మలన్నీ పరస్పర సంబంధాన్ని పెట్టుకున్నప్పుడు, సకల ప్రపంచం సమైక్యమవుతుంది.

యుగయుగాలుగా మనలో పాతుకున్న "నేను" "నాది" అన్న అహమును తన ఆలింగన ప్రాప్తితో పటాపంచలు చేసి, నేను-నీవన్న ద్వంద్వానుభూతిని పోగొట్టి ఈర్ష్య, ద్వేషాల్ని జయింపచేసి, మానవాళినుద్ధ రించేందుకు మెహెర్ బాబా మౌనావతారుడిగా మన మధ్యకు వచ్చి తన కొంగు బంగారు భాగ్యాన్ని కలిగించారు. అనంతశక్తి, జ్ఞాన, ఆనందాలు తనవే అయినప్పటికీ భగవంతుడు నిరాకారస్థితినుండి సాకారస్థితికి చేరి ఒక రూపాన్ని ధరించి తనవే అయిన అనంత శక్తిని, అనంత ఆనం దాన్ని ఉపయోగించకుండా కేవలం అనంత జ్ఞానాన్ని మాత్రమే మెహెర్ బాబా రూపంలో తన అవతార కార్యక్రమాన్ని నిర్వహించాడు. మానవాళిని వారి బాధలనుండి విముక్తుల్ని చేయుటకై, విశాత్మ బాధల్ని, నిస్సహాయ తని తానే అనుభవించారు. అనంతశక్తిని, అనంతానందాన్ని ఉపయోగిస్తూ లోకంలోని బాధల్ని తనపై వేసుకునే వీలుండదు కనుక వాటిని వినియో గించలేదు. అవతారుడు సకలజీవులకు జీవ నిర్జీవమైన సకల విశ్వమునకు దైవంగా అనంత జ్ఞానాన్ని మాత్రం ఉపయోగించి తన విశ్వ కార్య క్రమాన్ని నిర్వహిస్తాడు. తన శరీర త్యాగానంతరం, అనంతశక్తిని, అనంత ఆనందాన్ని వినియోగించి తన ప్రత్యక్షీకరణను ప్రకటిస్తాడు.

1962-68 మధ్య కాలంలో మెహెర్ బాబా శారీరకంగా అధిక బాధల్ని అనుభవించారు ఔషధ సేవనము తిరస్కరించి, డాక్టర్ల వైద్య సేవలను అనుమతించలేదు. సరిగ్గా అదే కాలంలో తన సత్యప్రేమ సందే శాల్ని బహుళ ప్రచారం చేయుటకు తన అనుచరులను అనుమతించారు. "భగవత్ వ్యతిరేకత విపరీతంగా పెరిగిపోవుటవల్ల, సాధు సన్యాసులు

గానో, ఆధ్యాత్మిక సంపన్నులుగానో నటిస్తూ, గురువులుగా తమకుతామే గొప్పలు చెప్పుకుంటున్నవారెక్కువగుట వలన నేను మానసికంగా అధిక వ్యధను అనుభవించవలసి వచ్చినది. మీరు నా భౌతిక బాధలను చూస్తున్నారేకానీ, నా మానసిక బాధను చూడలేకపోతున్నారు. నేను మహా చక్రవర్తిని. మీరు నాకు చెందినదే అయితే నాదైన అనంత ధనాగారంలో ప్రవేశించే అర్హతను పొందగలరు. అలాకాక, నా రాజ ప్రసాదపు రక్షకులు, సేవకుల (సాధువులు, యోగులు, మునులు వంటివారు) దరిచేరితే అది కేవలం మీ మూర్ఖత్వమే అవుతుంది" అని తన అనారోగ్యం గురించి వివరణలతో కూడిన ప్రకటన చేశారు. ఆయన ఆంతరంగిక కార్యక్రమ మేదయినప్పటికీ బాబా ఆరోగ్యం మాత్రం బాగా క్షీణించిపోయింది. అయినప్పటికీ సన్నిహితులకు అప్పుడప్పుడూ ఎంతో ఆరోగ్యంగా కనిపించేవారు.

1968 సెప్టెంబరులో తన ఏకాంతవాస జీవనానికి స్వస్తిపలికి "నా పని నూరుశాతం సంతృప్తితో పని పూర్తయింది. దాని ఫలితం కూడా నూరుశాతమేనని ప్రకటించారు. అప్పటికి చాలాకాలంగా ఆయన దర్శన భాగ్యం కొరకు ఆయన అనుయాయులు పరితపిస్తున్నారు, వాళ్ళందరిని ఊరడిస్తున్నారా? అన్నట్లు, 1968 అక్టోబరు 13న బాబా ఒక ప్రకటన చేశారు. తాను 1969 ఏప్రియల్ 10 నుండి జూన్ 10 వరకు తన ఏకాంత వాసాన్ని విరమించి, తన ప్రాక్పశ్చిమ బాబా ప్రేమికులందరికి తన దర్శన భాగ్యాన్ని కలిగిస్తానని ప్రకటించారు.

దర్శన వార్తను విన్న ప్రేమికులనేకులు పట్టరాని సంతోషాన్ని పొందారు. బాబా దర్శనానికి హాజరగుటకు ప్రత్యేక రైళ్ళ ఏర్పాట్లు కూడా మన రాష్ట్రంలో సౌ॥ కీ॥శే॥ పూజేటి రామమోహనరావు, చింతా సర్వారావు గార్ల ఆధ్వర్యంలో జరిగాయి. అయితే బాబా ఆరోగ్యం రోజు-రోజుకీ క్షీణించుటవల్ల పూనా, బొంబాయిల నుండి ప్రముఖ వైద్యుల్ని పిలిపించి, అవసరమైన వైద్య పరీక్షల్ని చేయించారు. అయితే ఆయన

శరీర స్థితిని బట్టి వ్యాధి నిర్ణయాన్ని ఏ డాక్టరు చేయలేకపోయారు. బాబా రక్తపరీక్షలో వెల్లడైన ఫలితాన్ని పరిశీలిస్తే, సాధారణ మానవుడైతే స్పృహ లేకుండా కోమాలో ఉంటాడు. కానీ బాబా మాత్రం ఎంతో ఉల్లాసంగా కనిపించి, డాక్టర్లను సైతం సరదాగా జోకులు వేస్తూ నవ్వించారు.

తన వింతవ్యాధిని గురించి బాబా 1953 మార్చి 21న చేసిన తన అంతిమ ప్రకటనలోనే ప్రస్తావించారు. మాయలో అనేకత్వం అంతరించి, ఏకత్వం ప్రారంభమయ్యే సమయంలో బాధలు అధికమై అనేకత్వ నాశనానికి కారణభూతమవుతుందని, అవతారుడిగా ఆయన వ్యక్తీకరణ బహు స్వల్ప కాలమే వుంటుందని, ఆ స్వల్ప కాలంలోనే తనకు వింత వ్యాధి అంకురించి, అవమానము, మౌన విరమణ, ఘనవైభవములతో పాటు ఆయన బలవన్మరణము జరిగిపోతుందని ఆ ప్రకటనలో ప్రకటించారు. ఈ ప్రకటనకు ప్రత్యక్ష నిదర్శనంగానే బాబాకు వింత వ్యాధి సోకింది. ప్రముఖ నిపుణులు సైతం ఆ వ్యాధిని గుర్తించలేకపోయారు. ఊహాలకందని యూరియా రక్తంలో కనిపించింది. కండరాల ఈడ్పులు భరించలేనంతగా కుదిపివేశాయి. 1969 జనవరిలో బాబా ఆరోగ్యం పూర్తిగా క్షీణించినట్లు మండలివారు గుర్తించారు. ఈడ్పులు మరీ ఎక్కువగుట వల్ల రాబోయే దర్శన కార్యక్రమాన్ని దృష్టిలో ఉంచుకొని బాబాను పూనాకు తీసుకువెళ్ళి పెద్ద ఆసుపత్రిలో పరీక్షలు చేయించి వైద్యం చేయించాలని శిష్యులు ఎంతో ప్రయత్నించారు. కానీ ఏమైనా సరే తనను కదిలించవద్దని బాబా తిరస్కరించారు.

ఎంతసేపూ అత్యంత ప్రాముఖ్యమైనది జరగబోతున్నదని సూచించారే తప్ప ఔషధసేవనకు, వైద్యానికి ప్రాముఖ్యతనివ్వలేదు. తన పరిస్థితి వైద్యానికి సంబంధించినది కాదని, జరుగనున్న తన దర్శన కార్యక్రమం గురించి ఆదుర్దాపడవద్దని, అంతకు మునుపు జరిగిన దర్శన కార్యక్రమాలకు భిన్నంగా యీసూటు తాను పడుకొన్న రీతిలో దర్శనమిస్తానని, తన దర్శనంకొరకు తపిస్తున్న వారికి తానే ఎప్పుడో, ఎక్కడో, ఎలాగో

దర్శనమిస్తానని బాబా చెప్పిన మాటల్ని మండలివారు అర్థం చేసుకోలేక పోయారు. 1969 జనవరి నెలాఖరులో బాబా శరీరమును కండరాలఈడ్పులు బాగా కుదిపివేశాయి. ఫలితంగా భరించలేని బాధను భరించాల్సి వచ్చింది. రెండు కారు ప్రమాదాల్లో చిక్కుకున్నప్పుడు కూడా బాబా అటువంటి బాధ పడలేదు. 1968 జూలై లో తన కార్యక్రమం నూరుశాతం సంతృప్తిగా పూర్తయిందని ప్రకటించారు. ఆ తరువాత మరో పర్యాయం "సమయ మాసన్నమైనది. దానిని గుర్తుంచుకొనుడు" అన్నారు. మరోసారి "వస్తోంది వస్తోంది, వస్తోంది, వచ్చేసింది. నేను మాయ నాటకంతో విసిగిపోయాను" అంటూ నర్మగర్భంగా క్షీణిస్తున్న తన అనారోగ్యం గురించి వివరించారు. 1969 జనవరి 30 న భయంకరమైన ఈడ్పులువచ్చి బాబా శరీరాన్ని కుదిపి వేశాయి. వాటిని తనను శిలువ వేయుటతో పోల్చి వివరిస్తూ "నా సమయమాసన్నమైనది" అని సౌంజ్ఞలు చేశారు.

"నేను కనిపించే ఈ శరీరాన్ని కాను. నేను అనంత చైతన్యాన్ని. ఉనికిలోని అన్ని భూమికల్లో పని చేస్తున్నాను" అని తరచూ చెప్పిన బాబా 1969 జనవరి 1న, ఈడ్పులు విడవకండా ఉధృతం కావటంవల్ల, రక్తంలో యూరియా 146% పెరిగింది. హెమోగ్లోబిన్ 6.5% కు పడిపోయింది. త్రిచూర్ నుండి డా॥ హిర్జీ అనే నిపుణుడు వచ్చి పరీక్ష చేశాడు. పూనా నుండి డా॥ గ్రాంటును సంప్రదించి 15 డిశంబరు 1968 ఒకసారి, 19 డిశంబరు 1968 న రెండవసారి రక్త మార్పిడి చేశారు. అయినా రక్త హీనత పెరిగి కాళ్ళు పాదాలు నీరుపటి వాచిపోయాయి. బొంబాయినుంచి డా॥ ఆర్. గిండేను పిలిపించారు. ఎవరెన్ని వైద్యములు చేసినా ఫలితం లేకపోయింది. విపరీతమైన ఈడ్పులతో బాబా వ్యధపడుతున్నప్పటికీ 1968 డిశంబర్ 22 న మెహెర్ పుట్టినరోజు. ఆ మర్నాడు శతృఘ్న కుమార్ కూతురు అమృత్‌కి ఆదీ జూనియర్ కుమారుడు దారాతో వివాహం బాబా సమక్షంలో జరిగాయి. ఆయన అంత అనారోగ్యంలో ఉన్నా ఈ రెండు కార్యక్రమాల్ని స్వయంగా దగ్గరుండి జరిపించారు.

"సమయమాసన్నమైనది" అని, "ఏమీ విచారించకుడు- ఈ నెలా

ఖర్చుకు అంతా సవ్యంగా జరుగుతుంది" అంటూ తన శిష్యుల్ని ఊరడి పరుస్తూంటే, వాటి అంతరార్థాన్ని ఏ ఒక్కరూ గ్రహించలేక పోయారు. కండరాల ఈడ్పులు ఎంతగా పీడించినా బాబా తన అలవాటు ప్రకారం, 1969 జనవరి 12 వరకూ ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం, మండలి హాలుకు వెళ్ళడం మానలేదు. జనవరి 12 తర్వాత బాబా తన గదిని వదిలి బయటకు రాలేదు. పాద్రి అనే శిష్యుడు బాబా దగ్గరకు వచ్చి, మండలి వారంతా వృద్ధులై పోయారు బాబా! ఈ దుకాణాన్ని మూసివేస్తే బాగుంటుందని అన్నాడు. అంత బాధలో ఉన్నప్పటికి బాబా "లేదు–అసలు దుకాణం ఇప్పుడే తెరవబడుతోంది" అన్నారు. 1969 జనవరి 30న ఈడ్పులు చెప్పలేనంతగా పెరిగిపోయాయి. తన చేతివేళ్ళ కదలిక కూడా కష్టమై పోయింది. ఆయన చేసే సౌంజ్ఞల్ని గుర్తించుటకు కూడా వీలు లేకుండా పోయింది.

పూనానుండి డా॥ గ్రాంటును మళ్ళీ పిలిపించారు. తీరా ఆయన వచ్చేసరికి ఊహించలేని విధంగా బాబా మంచి ఉల్లాసంగా కనిపించారు. ఆయన ఆరోగ్యం కుదుటపడిందనుకొని, నీరసం తగ్గేందుకు పుష్టికరమైన ఆహారం తీసుకోమని సలహాచెప్పి వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళగానే తిరిగి బాబాకు ఈడ్పులు మొదలయ్యాయి. మండలి వారికి సహాయపడుటకు మెహెరాబాదునుండి పాద్రిని పిలిపించారు. 1969 జనవరి 31 శుక్రవారం ఉదయం అలోబా అనే శిష్యుడ్ని మండలి గదికి పంపి అక్కడున్న హాఫీజు సూక్తులున్న బోర్డును తెప్పించారు. అందులో ఈ క్రింది మూడు సూక్తులున్నవి.

1, నన్ను అజ్ఞానమునుండి విముక్తుడ్ని చేసిన నా గురువుకు నేను బానిసను. నా గురువు ఏం చేసినా, అందుకు సంబంధించిన వారందరికి, అది అత్యున్నత లబ్ధిని కలిగిస్తుంది.

2 అదృష్టవంతుడయిన బానిసలా, గురువు ఆదేశించిన ప్రతి ఆదేశాన్ని ఎందుకు, ఏమిటి అనే ప్రశ్న వేయక పాటించుము.

3. నీ గురువునుండి నీవేమివిన్నా, అది తప్పు అని ఎన్నడూ అనకు" నా ప్రియతమా! ఏలనన, ఆయన్ని అర్థం చేసుకోలేని అసమర్థతే నీలోని లోపం.

ఈ బోర్డును అలోజా తీసుకురాగానే అందున్న పై మూడు సూక్తులను శిష్యులందరికి చదివి వినిపించేటట్లు చేశారు. ఆ తర్వాత తన డాక్టరుతో జోకులు విసురుతూ "నేను భగవంతుడినని మరువకండి" అన్నారు. బాబా శరీర త్యాగం చేసే వరకూ ఈ బోర్డును రోజూ చూస్తూన్నా దాన్ని ప్రాముఖ్యాన్ని ఎవరూ గమనించలేదు. తన శరీర త్యాగానంతరం ఎటువంటి అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడుతుందో ఎంత మంది ఎన్ని రకాలుగా వ్యాఖ్యానించుకుంటారో బాబాకు బాగా తెలుసు. అందుకే ఈ బోర్డులోని మూడు సూక్తుల్ని తన సమక్షంలో చదివించుట వల్ల, అందరి అనుమానాల్ని తీర్చుటకు దోహదపడ్డాయి.

1969 జనవరి 31 మధ్యాహ్నం 12-15 ని॥లకు మళ్ళీ ఒక పెద్ద ఈడ్పు వచ్చి ప్రియతముని ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసి పోయాయి. మెహెరాబాదు కొండపై 1938 లోనే బాబా స్వయంగా నిర్మాణం చేసుకొన్న తన భావి సమాధిలో అంతకు ముందే ఆయన ఇచ్చిన ఆదేశం ప్రకారం, బాబా శరీరాన్ని సమాధి చేయుటకు ఏర్పాటు చేశారు. బాబా ఆదేశాల ప్రకారం, బెగిన్ ది బిగైన్ అనే పాటను ఏడు సార్లు రికార్డువేశారు. అదే రోజు రాత్రి 7-00లకు బాబా సమాధిలో ఆయన శరీరాన్ని ఉంచి మూయకుండా వచ్చేపోయే అశేష ప్రజానీకం సందర్శించుటకు వీలుగా ఉంచారు. ఏడు రోజులుంచినా ఆ దివ్య మంగళ రూపం చెడిపోకుండా నిద్రపోతున్నట్లే వెలిగిపోయింది. లక్షలాదిమంది కడసారి ఆయన దర్శన భాగ్యాన్ని పొందిన అనంతరం, 1969 ఫిబ్రవరి 7వ తేదీన సమాధిని మూసివేశారు. ఈ విధంగా మానవసేవలో తన జీవితాన్ని అర్పించిన అవతారుడు శారీరకంగా, మానసికంగా ఆధ్యాత్మి

కంగా కూడా మానవాళి కొరకు పాటుపడి పరిమితమైన భౌతిక శరీర బంధమునుండి, సర్వ వ్యాపకుడయ్యాడు.

అవతారుడిగా మెహెర్‌బాబా తన ప్రేమవలనను విసిరి, తన ప్రేమికులను చేరదీసి, సంస్కార రహితుల్ని చేసి తమ గమ్యాన్ని చేర్చే కార్యక్రమాన్ని నిర్వహించారు. మనలో మంచి చెడు సంస్కారా లున్నంత వరకూ మనం, పరమాత్మలో ప్రవేశించుటకు అర్హులం కాలేము. ఆయన మనల్ని తన కొంగును గట్టిగా పట్టుకొన మన్నారంటే, మనల్ని ఇంకా పసిపిల్లలుగా మారాలని చెప్పారన్న మాట. అది ఎక్కువగా మన మాయనపై ఆధారపడేట్లు చేస్తుంది. మన జీవిత భారాన్నంతా ఆయనపై పెట్టుట కాదు దాని భావం. మనకు తోచినదేదో చేసేసి, తాపీగా కూర్చొని, అంతా ఆయనే చూచుకుంటాడులే అని కూర్చోక, పసి పిల్లలుగా మారి, ఉల్లాసంతో కేరింతలాడుతూ, నిశ్చింతంగా గంతులు వేస్తూ, మన విధ్యుక్త ధర్మాలాచరించాలి. జీవితాన్ని ఆనందంగా గడుపుతూ, మనస్సులో మాత్రం, సుఖశాంతులకు, కుటుంబ రక్షణకు, అవసరమయ్యే శక్తి బాబా కృపవల్ల కలిగిందన్న ఆలోచన వుండాలి.

"ప్రేమ భగవంతుడు మానవునికిచ్చే వరం. విధేయత సద్గురువు మానవునికిచ్చే కానుక. సర్వార్పణ మానవుడు తన గురువునకిచ్చే బహుమానము" అని బాబా వివరించారు. డెహరాడూన్ పట్టణంలో ఒక బాబా ప్రేమిక కుటుంబం వున్నది. బాబా డెహరాడూన్ ఎప్పుడు వెళ్ళినా వారింటికి వెళ్ళేవారు. వారి పిల్లలు బాబాతో చనువుగా ఆడు కొనేవారు. ఆ కుటుంబమంతా బాబాతో మండలి వారంత చనువుగా మెసిలేది. ఒకసారి బాబా సతారాలో మండలితో వున్నారు. ఏకాంత ముగా గడుతున్నారు. చిన్న పూరిపాకలో విశ్వ కార్యక్రమాన్ని నిర్వ హిస్తున్నారు. బయట వంతులు వారిగా మండలి కావలి కాస్తున్నారు. ఆ సమయంలో డెహరాడూన్ నుంచే యీ బాబా ప్రేమికుడు బాబాను దర్శించాలని వచ్చాడు. ఆ సమయంలో అలోబా కావలి వున్నాడు.

అతడ్ని చూచి ఇప్పుడెందుకు వచ్చావని ప్రశ్నిస్తే బాబా దర్శనం కొరకు వచ్చానని చెప్పాడు. బాబా ఏకాంతంలో వున్నందున ఎవరికి దర్శన మివ్వరని సర్వ్యాలరు పంపినా ఎందుకు వచ్చావని మళ్ళీ అడిగాడు అలోబా. "15,000 మైళ్ళు కష్టపడి ప్రయాణం చేసి వచ్చాను. బాగా అలసిపోయాను. బాబా లేరా ? నేను తప్పక ఆయన దర్శనం చేయాలి !"

"బాబా ఉన్నారుకానీ, ఆయన్ని ఎవరూ చూచే వీలులేదు" అని అలోబా చెప్పాడు. "ఒక్క క్షణకాలం పాటు బాబాను చూచేందుకు ఇంత దూరం ప్రయాణం చేసి వచ్చాను. దయచేసి తగిన అవకాశం కల్పించి సహాయపడమ"ని ప్రాధేయపడ్డాడు. అతని తపనకు అలోబా కాస్త మెత్త బడి, ఈ రాత్రికి ఎలాగో గడిపి, రేపు ఉదయం ఇక్కడే వుంటే, బాబా ప్రాతఃకాల నడకతో ఇటుగా వచ్చినప్పుడు దూరంగా ఉండి ఒక్క క్షణం చూచి తిరిగి వెళ్ళిపొమ్మని సలహా చెప్పాడు. అయితే ఆ మర్నాడు బాబా ఆ వ్యక్తిని దూరంగానే చూచి అతడు ఎందుకు వచ్చాడని ఆలోబాని ప్రశ్నించగా, అతడి ప్రేమ గురించి చెప్పి, అతడి ప్రేమే అతడ్ని అక్కడకు చేర్చిందని చెప్పాడు. అంతట బాబా అతడ్ని పిలిపించి, ఎందుకు వచ్చావని ప్రశ్నించారు. "బాబా నీయందున్న ప్రేమే నన్నిక్క డకు తీసుకువచ్చిందని" చెప్పాడు. "అయితే సరే! చూచావుగా, వెళ్ళిపో" అన్నాడు.

కానీ అతడు కదలలేదు. అలాగే నిలబడి బాబాకు తన బాధలను చెప్పుకో సాగాడు. తనపై ఆరు కోర్టు కేసులున్నాయని, భార్యకు క్షయరోగమని, ఎన్ని వైద్యాలు చేయించినా తగ్గుట లేదని, తన కూతురుకు పెళ్ళి సంబంధం ఖాయపరచి అన్ని ఏర్పాట్లు పూర్తయ్యాక ఆగిపోయిందని తన సమస్యలన్నిటినీ ఏకరువు పెట్ట సాగాడు. అన్నీ వింటూనే బాబా అలోబా వైపు చూస్తున్నారు. ఆ ప్రేమికుడు తన సమస్యలనుండి విముక్తి కలిగేందుకు బాబా ఆశీస్సులుకై వచ్చినట్లు,

ఆశీర్వదించమని కోరాడు. ప్రేమవల్ల వచ్చాడన్నావు కదూ! అంటూ అలోజా వైపు చూచి, "నీవేమీ కంగారు పడకు. నా ప్రేమను తీసుకు వెళ్ళు!" అన్నారు. కానీ అతడు ఆశీర్వదించమని పట్టు బట్టాడు. "వద్దు! నేనలా ఆశీర్వదిస్తే నీవు నన్ను పోగొట్టుకుంటావు" అని హెచ్చరించినా అతడు వదలలేదు. "నీ విప్పుడు నా ఆశీస్సులు కోరవద్దు. నేను విశ్వకార్యక్రమంలో వున్నాను. నేను ఏకాంతంలో వున్నప్పుడు అసలు నీవు ఇక్కడకు రావటమే తప్పు, పోనీ వచ్చావు కదా అని నా ప్రేమను నీతోపాటు తీసుకువెళ్ళేందుకు అనుమతించాను. వెంటనే వెళ్ళిపో. నీ సమస్యల్ని ధైర్యంగా ఎదుర్కో, నేను అనుక్షణం నీతోపాటే ఉంటా నని మరువకు" అని హితవు చెప్పారు.

అయినా అతడు వదిలి పెట్టక ఆశీర్వదించమని పట్టుబట్టాడు. "బాబా నేను నిన్నెలా వదిలిపెడతాను? నిన్ను పోగొట్టుకోవటం కానీ, మరచిపోవటం కానీ, అసాధ్యం. కనుక బాబా నన్ను ఒక్కసారి ఆశీర్వదించు" అని బ్రతిమలాడాడు. "అందుకే చెపుతున్నాను. ప్రశాంతంగా నా ప్రేమను తీసుకువెళ్ళు" అని మరోసారి హెచ్చరించినా ఏమైనాసరే దీవెనలిచ్చి తీరాలని పట్టు బట్టాడు. అంత బాబా తన నుదురుని అతని పాదాలపై ఆనించి, వందనములర్పించి, "ఇది చాలు వెళ్ళిపో" అన్నారు. అయినా అతడు బాబాను దీవించమని నన్ను వేధించాడు. "అయితే సరే! నా దీవెనలందిస్తున్నాను. మరి నీవువు తోలోప్తావు. నేను నిన్ను ఆశీర్వదిస్తున్నాను. వెళ్ళిపో" అన్నారు. అలా అతను వెళ్ళిపోయాక, అతడు మరెప్పుడూ బాబా దగ్గరకు రాలేదు. అమరతిథి కార్యక్రమాలకు కూడా హాజరు కాలేదు. బాబా కోరిన విధంగా నడుచుకోకుండా పట్టుబట్టి తన కోరికను సాధించుట అవిధేయత అవుతుంది. అది ఆయన్ని పోగొట్టుకోవడమే అయింది. కానీ బాబా ఆశీస్సుల ప్రభావంతో అతడు తన కేసులన్నీ గెలిచాడు. భార్యకు క్షయ తగ్గింది. కూతురికి మంచి సంబంధం కుదిరి పెళ్ళయింది. వ్యాపారంలో బాగాలాభాలొచ్చి కోటీశ్వరు

డయ్యాడు. ఐహికంగా జయం కలిగింది. కానీ ఆముష్మికంగా బాబాను పోగొట్టుకున్నాడు.

మెహెర్‌బాబా నిర్వహించిన కార్యక్రమసరళి ముఖ్యంగా మానవాళికి సంబంధించినది. స్త్రీ పురుష భేదం లేకుండా, జాతి, కుల, మత వివక్షత లేకుండా మెహర్‌బాబా అందరి సంస్కారాలను స్వీకరించి, వారు వాటిని అధిగమించకలిగేట్లు సహాయపడ్డారు. ఆయన ప్రజలతో గడిపిన కథల్ని వింటే, మానవుడికి చెందిన ప్రకృతి సహజమైన మంచి - చెడు, ఉచ్ఛ-నీచము, ఆధ్యాత్మికము, భౌతికమువంటి ద్వంద్వ గుణాలేవీ దాయకుండా చోటునేసుకుంటాయి. ఆయన తన జీవితంలో అఖండంగా కొనసాగించిన 45ఏళ్ళ మౌనము, ప్రజలచే ఆయన మౌనావతారుడిగా గుర్తించబడేట్లు చేసింది. అవతారుడిగా తన సజీవ పదములు కేవలం 3 1/2 ఏళ్ళు మాత్రమే 9 జూలై 1925 వరకు వినిపించాయి. ఆయన మౌనంగా వున్నట్లు సకల ప్రపంచం గుర్తుంచుకోవాలని కోరుకున్నారు. ఎప్పటికప్పుడు మౌనవిరమణ చేస్తున్నట్లు ప్రకటించి విరమించకుండానే ఆయన ఉచ్చరించే పదములకు పదమైన ఆదిపదాన్ని గుర్తుంచుకొనేట్లు చేశారు.

ఈ 20వ శతాబ్దానికే కాకుండా రాబోయే అనేక శతాబ్దాలవరకు, మెహెర్‌బాబా స్వయంగా వ్రాసిన రచనలు, అవతారుని జీవిత చరిత్రకు జవాబుగా ఎన్నో వివరాలందిస్తాయనుటలో సందేహంలేదు. ఈ యుగంలో దైవత్వపు విశదీకరణగా మెహెర్‌బాబా అవతరణను ప్రపంచమంతా యీనాడు అంగీకరించుటకు తయారవుతోంది. ఆయన సజీవంగా ఉన్న నిర్వహించిన కార్యక్రమసరళి, ఇప్పుడు మానవ చైతన్యంపై ప్రభావితం చేస్తూ ఆయన దివ్యత్వాన్ని గుర్తించేట్లు చేస్తున్నది. భగవద్వచనములు, సర్వము–శూన్య ప్రవచనములువంటి బాబా సందేశాలకు సంబంధించిన నగ్నసత్యాల్ని మానవాళికి అందించుట ఆయన అనుయాయులు తక్షణ కర్తవ్యం.

ఒకప్పుడు మెహెర్‌బాబా, తానూ ఒక న్యాయనిర్ణేతనని వివరించారు. న్యాయనిర్ణేతగా తనకూ, భౌతికపరమైన న్యాయాధిపతులకు భేదమున్నదని, ప్రపంచంలోని న్యాయాధిపతులు దోషియొక్క దోషాల్ని ఋజువుపరిచి, చేసిన తప్పుకు సరిపడ దండనతో శిక్షిస్తారు. అలాగేతానూ దోషియొక్క దోషాల్ని ఋజువుపరుస్తారుకానీ ఆ దోషి పశ్చాత్తాప పడేట్లు చేసి క్షమించి వదిలేస్తానని చెప్పారు. పూనాలో ఒక బాబా ప్రేమికుడుండేవాడు. అతడు బాబాను సాక్షాత్తు అవతారుడిగా ఆరాధిస్తూ ఎనలేని సేవలందించిన బాబా కార్యకర్త. అతని స్నేహితుల్లో చాలా సన్నిహితుడయిన ఒక ధనవంతు డుండేవాడు. అతడికి మెహెర్ అవతార విశిష్టతను ఎంతగా వివరించినప్పటికీ, బాబా ప్రేమ పరిధిలోకి అతడ్ని తీసుకు రాలేకపోయాడు. అయినా తనవంతు ప్రయత్నం మాత్రం చేస్తూనే వున్నాడు.

అలా ఉండగా ఒకరోజున అతని మిత్రుడు బార్‌లో మధుపానం చేస్తుండగా పక్కవాడితో మాటా మాటా పెరిగి చివరకు ఉద్రేకంతో త్రాగుతున్న సారా సీసాను పగలకొట్టి అతని కడుపులో పొడిచేసరికి అతడు చనిపోయాడు. ఫలితంగా అతని మిత్రుడిపై పోలీసు కేసు పెట్టి యరవాడ జైల్లో బంధించారు. బాబా ప్రేమికుడు అతడ్ని కలిసి మెహెర్ బాబాను విశ్వసించి ఆయన శరణు కోరుకో. నీకు న్యాయపరంగా సహాయం జరుగుతుందని చెప్పాడు.

అయితే అందుకతను ఇష్టపడలేదు. ఇలాంటి బాబాలపై తనకునమ్మకంలేదని నిష్కర్షంగా చెప్పాడు. కొన్నాళ్ళకు క్రింది కోర్టు అతనికి మరణ దండన విధిస్తూ తీర్పు చెప్పింది. ఆ పైన హైకోర్టుకు అప్పీలు చేసుకున్నాడు. అప్పుడు కూడా అతనితో మెహెర్ ప్రేమికుడు బాబాను విశ్వసించి శరణు కోరమని చెప్పినా తిరస్కరించాడు. కొన్నాళ్ళకు హైకోర్టు కూడా క్రింది కోర్టు తీర్పును ఖాయపరచింది. మళ్ళీ సుప్రీం కోర్టులో అప్పీలు వేసుకోగా సుప్రీం కోర్టు కూడా మరణ శిక్షను ధృవీకరించేసరికి గత్యంతరం లేక, రాష్ట్రపతికి మెర్సీ పిటీషను పెట్టుకున్నాడు.

అప్పుడు కూడా మెహెర్ ప్రేమికుడు విడువకుండా అతడ్ని బాబా శరణు కోరమని చెప్పాడు. కానీ అతడికి నమ్మకం కుదరలేదు. చివరకు రాష్ట్రపతి కూడా కేసు పూర్వాపరాలు పరిశీలించి, నిర్దాక్షిణ్యంగా హత్య చేసిన అతడు క్షమార్హుడు కాదని అతని దరఖాస్తును తిరస్కరించి, తక్షణం ఉరిశిక్షను అమలు పంచమని జైలు అధికారులను ఆదేశించారు. ఉరిశిక్ష అమలుకు పూనా యరవాడ జైలు అధికారులు తేదీ, సమయం నిర్ణయించారు. మళ్ళీ ప్రేమికుడు, తన మిత్రుడ్ని కలిసి, ఆఖరి ప్రయత్నముగా ఇప్పుడైనా బాబా శరణుకోరమని, తను అనుమతిస్తే తన తరపున తానే బాబాను స్వయంగా కలిసి, తానే అభ్యర్థిస్తానని చెప్పగా ఎలాగూ ఉరిశిక్ష పడబోతున్నందున ఆఖరి ప్రయత్నంగా మెహెర్‌బాబాను కలిస్తే పోయేదేమున్నదన్న భావంతో "సరే" అన్నాడు.

అప్పుడు మెహెర్ ప్రేమికుడు క్షణం కూడా ఆలశ్యం చేయకుండా మెహెరాబాదు చేరి బాబాను కలిసే ప్రయత్నం చేశాడు. అయితే మెహెర్‌బాబా ఏకాంతవాసంలో ఉన్నందున కలియుటకు వీలులేదని, మండలివారు చెప్పి అతడ్ని తిప్పివేశారు. అతడు తిరుగుముఖం పట్టి రోడ్డుపైకి చేరేంతలోనే బాబా చప్పట్లుకొట్టి ఎరుచ్‌ని పిలిచి వచ్చిన దెవరని తెలుసుకొని వెంటనే అతడ్ని వెంటపెట్టుకు రమ్మని ఆదేశించారు. ఎరుచ్ సైకిలుపై వెళ్ళి దారిలోనే మెహెర్ ప్రేమికుడ్ని కలిసి వెనక్కు తీసుకు వచ్చాడు. బాబా అతడు వచ్చిన పైనాన్ని తెలుసుకొని తన ఫోటో నొకదానిని ఇచ్చి వెంటనే పూనా చేరుకొని జైల్లోని తన మిత్రుడ్ని కలిసి, అతడు ఎటువంటి పరిస్థితుల్లో ఉన్నప్పటికీ అతడి రొమ్ముపై తన ఫోటో నుంచి అతడి చెవిలో అవతార్ మెహెర్‌బాబాకి జై అని ఏడు పర్యాయాలు అనమని ఆదేశించారు. అమితానందంతో అతడు వెనుదిరిగి పూనా చేరుకున్నాడు.

జైలుకు వెళ్ళేసరికి అతని మిత్రుడికి సెలైన్ ఎక్కిస్తున్నారు. ఆ మర్నాడు తెల్లవారుఝామున ఉరిశిక్ష విధిస్తారు గనుక, జైలు నియమాల్ని

పొటిస్తున్నారు అధికారులు. అతడు మత్తులో ఉండుట వలన మిత్రుని రాకను గమనించలేదు. అయినా బాబా ఆదేశాల ప్రకారం బాబా ఫోటోను అతని ఎదుదు రొమ్ముపై వుంచి చెవిలో అవతార్ మెహెర్‌బాబాకిజై అని ఏడుసార్లు ఉచ్చరించాడు. అంతలోనే అతని శరీరమంతా ముచ్చెమటలతో తడిసి ముద్దయింది. బాబా ఆదేశం మేర, తన వంతు కర్తవ్యాన్ని పూర్తి చేసి వెను తిరుగుతుంటే మర్నాడు ఉరిశిక్ష అమలుకాగానే మృతదేహాన్ని వప్పగించుకొనుటకు అతని తరపున ఎవరు వస్తారని జైలు అధికారులు అడుగగా తనే వస్తానని చెప్పాడు.

ఉదయం 6-00 లకే ఒక టాక్సీని పూలతో అలంకరించి స్నేహితుని మృతదేహాన్ని వప్పగించుకొనుటకు మెహెర్ ప్రేమికుడు అతని కుటుంబ సభ్యులను వెంటబెట్టుకు వచ్చాడు. తీరా వారు జైలు ప్రధాన ద్వారం దగ్గరకు చేరేసరికి, జైలు అధికారులతో కలిసి, ఉరితీయబడ వలసిన అతని మిత్రుడు నవ్వుతూ నడిచిరావటం కనిపించింది. ముందుగా నమ్మలేకపోయారు. కానీ అది నిజమని తెలిసేసరికి అంతా ఆశ్చర్యపోయారు. అంత క్రితంరోజు సాయంత్రం భారత రాష్ట్రపతిగా డా॥ ఫక్రుద్దీన్ అహ్మద్ ప్రమాణస్వీకారం చేసిన శుభ సందర్భంగా ఆ రోజు తెల్లవారుఝామున అమలు పరచవలసిన ఉరిశిక్షలన్నిటినీ దేశ వ్యాప్తంగా రద్దుపరుస్తున్నట్లు రాష్ట్రపతి ఆదేశాలు జారీచేశారు. ఆయన ఆదేశాల్ని అర్ధరాత్రి సమయంలో అందుకున్న జైలు అధికారులు ఇతని ఉరిశిక్షను రద్దు చేసి, వదిలివేశారు. అందుకే అతడు ఆనందంగా నడుస్తూ రావడం కనిపించింది. ఇది కాకతాళీయమనిపించినప్పటికీ, ముమ్మాటికీ అవతారుడి ప్రమేయమున్నదనుట సత్యం.

ప్రేమ ఉత్సాహపరుచుటను, సహాయపడుటను కోరుకుంటుంది. మానవులు భౌతిక బంధాలకు బందీలై మంచితనపు చట్టపరిధి నుండి విడిపోతున్నారు. కానీ భగవంతుడు ఎన్నడూ మనలను నాశనం చేయడు. తన గుమ్మంలో నుండి గెంటి వేయడు. ఆయన్ని ప్రేమించని వారిని

సైతం, తనను ప్రేమించుటకు ప్రయత్నించతలిగేట్లు ఆశీర్వదిస్తారు. బాబా కోరేది సర్వార్పణ. సర్వార్పణ ఎప్పుడు కాగలుగుతాం? ముందు విశ్వాసం కుదరాలి. విధేయత అబ్బాలి. ప్రేమ పెరగాలి. ఏకాగ్రత అలవడాలి. అప్పుడే సర్వార్పణా భావం కలుగుతుంది. నాదంటూ ఏమీ ఉంచుకోకుండా సర్వం కైంకర్యం చేసుకొనే అదృష్టం వరిస్తుంది.

ఒకసారి ఈ సర్వార్పణ గురించి మెహెర్‌బాబా ఇలా వివరించారు. "చాలా సంవత్సరాల క్రితం మెహెరాబాదుకు ఒకతను వచ్చి, తాను తన సర్వస్వాన్ని నాముందు సమర్పణ గావించ దలచినట్లు చెప్పాడు. స్వర స్వము అంటే ఎమిటని అతడ్ని అడిగితే, "నేను, నా భార్య, నా నల్గురు పిల్లలు" అని చెప్పాడు. ఇటువంటి సమర్పణ, యదార్ధ సమర్పణకాదు- ఎటువంటి బాహ్యప్రదర్శనల వలన భగవంతుడు మూఢుడు కాబోడు. పూజావిధానాలు, ప్రార్థనలు, మంత్రోచ్చాటన, చర్చిగంటల మోత, మొదలగు వాటికి ఆయన చెవిటివానివలె ఉండిపోతాడు. ఇటువంటి భౌతికచర్యల నాయన ఎన్నడూ అంగీకరించడు. అటువంటి తియ్యటి మాటలకు లొంగిపోడు. ఆయన్ని చలింపచేసేది ఒక్క ప్రేమ మాత్రమే. అంతేగాకుండా ఏదీ ఆయన్ని ఉపయోగించుకోలేదు.

ఆయన నోటిమాటల భాషను వినియోగించుకోడు. జపాలు, మంత్ర తంత్రాలు, భక్తిగీతాలు, భజనలను వినడు. మనోభాషను కూడా వినడు. సత్యానుష్ఠానము, ధ్యానము, ఏకాగ్రత, దైవాలోచన, వంటివి కూడా వినడు. కేవలం హృదయభాషను మాత్రమే భగవంతుడు వింటాడు. హృదయ భాషయొక్క సందేశమే ప్రేమ. ఆ ప్రేమనే ఆయన వింటాడు. కేవలం ప్రియతమునికి, మౌనంగాచేసే ధ్యానం చాలు.

ఒకసారి సాధువొకరు మెహెర్‌బాబా దర్శనానికి వచ్చాడు. తనకు అప్పుడప్పుడు కలలు వస్తాయని, ఆ కలల్లో తను గాలిలో ఎగిరిపోతున్నట్లు అనిపిస్తుందని చెప్పి, దీనికేమైనా ఆధ్యాత్మిక విలువ ఉంటుందా? అని

బాబాను అడిగాడు. "కలల్లో జరిగేదానికి విలువేముంటుంది? పక్షులు గాల్లో ఎగురుటలేదా? పూర్వకాలంలో కొందరు యోగులు పక్షుల్లాగా ఎగరగలిగే సామర్థ్యంకలిగి ఉండేవారు. భగవత్సాక్షాత్కారమికునికి ఇలాంటివేమీ అక్కర్లేదు" బాబా బదులిచ్చారు.

అవతారుడు మానవరూపంలో వున్న భగవంతుడు కనుక, తన వ్యక్తిత్వంలో, దైవముయొక్క విశ్వచైతన్యాన్ని, మానవ పరిమిత చైతన్యాన్ని కూడ ఏకకాలంలో కలిగి వుంటాడు. ఇది ఒక విచిత్రమైన ద్వంద్వ సంయోగము. ఆయనలో ఈ కారణంగానే భగవంతుని అనంత శక్తి, మానవుని సహజ బలహీనతలు రెండూ మిళితమై వుంటాయి. తన అనంతజ్ఞానంద్వారా మానవుల బాధలను తాను భరించుటవల్ల అవతార్ మెహెర్‌బాబా అమితంగా బాధలనుభవించారని చెప్పుకున్నాం కదా!

"మానవుల కొరకు నేనుపడే బాధకంటే, ఘనమైనదీ, మహిమాన్వితమైనదీ, మరింకేదీ లేదు" అని బాబా ప్రకటించారంటే ప్రతి హృదయాన్ని తన నిలయంగా మార్చుటకు దోహదపడుటకే.

ఒకసారి బాబా తన అంతరంగిక కార్యక్రమంలో భాగంగా ఏకాంతవాసంలో వున్నారు. ఎవరికీ దర్శనమిచ్చుటలేదు. ఆ సమయంలో అప్పటి ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ రాజా ఎం.ఆర్. అప్పారావుగారు సతిసమేతంగా బాబా దర్శనానికి వెళ్ళారు. తాను ఎవరినీ దర్శనానికి అనుమతించకపోయినా, ఈ దంపతులకు దర్శనభాగ్యాన్ని కలుగచేయుటయేగాక, అంతకు ముందెన్నడూ, ఎవరికీ లభ్యంకాని గొప్ప సదవకాశాన్ని వీరికి కల్పించారు. బాబా పాదద్వయాన్ని ఆవుపాలతో కడిగి పాదపూజ చేసుకొనే మహద్భాగ్యాన్ని శ్రీ అప్పారావు దంపతులకు కలుగచేశారు.

సృష్టిలో జరిగే ప్రతికార్యము, కదలికా సద్గురువు యొక్క అజ

మాయిషీలో జరుగుతుంది. ఆయన ఇచ్ఛలేనిదే ఆకు కూడా కదలాడదు. భగవంతుడు కేవలం సర్వస్వతంత్రుడు ఈ విశ్వము మాత్రము, విశ్వ నాదునిపై ఆధారపడి వున్నది. తమ వంతు కార్యక్రమాన్ని నిర్వహిస్తూనే సమయ మాసన్నమైనప్పుడు, సద్గురువులు భగవంతుని భూమిపైకి అవత రింపచేసినప్పుడు, వారు సత్యమును, మాయను, పరస్పరాధారమయ్యేట్లు చేస్తారు. దీని ఫలితంగా మాయలో మునిగిన వారంతా పరమాత్మయొక్క అనంత కృపను, అపార ప్రేమను కాంక్షించి ప్రార్థిస్తారు. తన మండలి నుద్దేశించి ఒక రోజున బాబా మాట్లాడుతూ, "గత ప్రథమ ప్రపంచ మహా సంగ్రామం సద్గురు శ్రీ సాయి మహరాజ్ అజమాయిషీ క్రింది జరిగిందని, అయినప్పటికి ఆయన తనకేమీ తెలియనట్లు, సంబంధం లేనట్లు, లోకానికి తెలియని షిరిడీలో కూర్చొని, లోక వ్యవహారాన్ని చక్కపెడుతున్నారు" అని చెప్పారు.

అలాగే 1965లో అప్పటి చైనా యుద్ధం గురించి మండలి సభ్యు లలో సుదీర్ఘ చర్చ జరిగింది. చైనాతో యుద్ధం త్వరలో ముగియకపోతే బ్రిటిషు పౌరులు ఎక్కువగా నష్టపడి బాధలకు గురి కావలసి వస్తుందని బాబా వ్యక్తం చేశారు. 3 మే 1965న అప్పటి మన ఆంధ్రప్రదేశ్ ఆర్థిక మంత్రి డా॥ మర్రి చెన్నారెడ్డి కుటుంబ సమేతంగా వచ్చి పూనా గురు ప్రసాద్‌లో బాబా దర్శనం చేసుకున్నారు. ఆ సందర్భంలో బాబాకు ఆయనకు మధ్య ఈ క్రింది విధంగా రాజకీయ చర్చ జరిగింది.

"బాబా! పాకిస్థాన్‌కి, మన భారతదేశానికి మధ్య తగాదా ఉన్నది కదా! దీని పరిష్కారం ఎలా వుంటుంది?" అని శ్రీ చెన్నారెడ్డిగారు గారు అడిగిన ప్రశ్నకు బాబా స్పందిస్తూ "నేను భారత గడ్డపై జన్మించి ఉన్నందున భారతావని ధన్యత చెందినది. కనుక యీ విషయంలో కలత పడవలసిన పనిలేదు. ఏమీ విచారించనవసరంలేదు" అన్నారు. "కానీ బాబా! చైనాతో కూడా భారతదేశపు చెలిమి ఏమీ బాగాలేదు కదా! వారు కయ్యా

నికి కాలు దువ్వుతున్నారు. చైనాతో వైరము ఎలా పరిణమిస్తుంద"ని మరల ప్రశ్నించారు.

"నేను సర్వాంతర్యామిని. నాకు సర్వము తెలుసు. భారతదేశం ఏమాత్రం ఆందోళన పడవలసిన పనిలేదు. నా అనుగ్రహం మీపై సదా వుంటుంది, నేను నా మౌన విరమణ చేసినప్పుడు, ఈ ప్రపంచం, నేనెవరై యున్నానో తెలుసుకొంటుంది. అప్పుడు దుఃఖమంతా అంతమొందుతుంది. మానవాళి అప్పుడు నన్ను ప్రేమించుట ప్రారంభిస్తారు. అప్పుడు వారు భగవంతుని గూర్చి తప్ప మరే ఇతర విషయాల గురించి ఆలోచించవలసిన అవసరంలేదని తెలుసుకుంటారు" అని బదులిచ్చారు.

"నేను మిమ్ములను ప్రేమిస్తున్నాను. కేవలం భగవంతుడు మాత్రమే అలా ప్రేమించగలడు. మీరు కూడా నన్ను, మరింత ఎక్కువగా, అతి గాఢంగా ప్రేమించండి. నా కొంగును గట్టిగా పట్టుకొని ఉండండి. నేను మీకు ఇవ్వవలసినది మీకు పూర్తిగా ముడుతుంది. ధైర్యంగా ఉండండి. కలత పడవద్దు. సుఖంగా ఉండండి. నేనూ మీరూ ఒక్కటే. ఇప్పుడు శాశ్వతంగా నాదై యున్న అనంతత్వం, ఏదో ఒకరోజున మీదే అవుతుంది. అది మీలో ప్రతి ఒక్కరిదీ అవుతుంది. మీకు నా యందు పరిపూర్ణ విశ్వాసం ఉండినన్నే అంటిపెట్టుకొని ఉండండి. లేనిచో నన్ను పూర్తిగా వదలి వేయండి" అంటూ బాబా ఎన్నో సూక్తులు ప్రవచించారు. ఆయన కటాక్షం పొందేఅర్హత సంపాదించాలంటే ఆయన అందించిన సూక్తుల్ని మననం చేసుకొని, వాటి భావాల్ని సాకల్యంగా ఆకళింపు చేసుకోవాలి. బాబాను ప్రేమించుటకు, ఆయనకు విధేయులుగా వుండుటకు మనం ప్రయత్నించాలి. జాతి కుల, మత వివక్షత లేకుండా అన్ని మతాలు, కులాలు, తెగలకు సంబంధించిన శిష్యులెందరో బాబాకు అనుయాయు లయ్యారంటే, అందుకు కారణం మెహెర్‌బాబా అందించిన దివ్యబోధల్లో సర్వమత సిద్ధాంతం అంతర్లీనమై యున్న పరమ సత్యము. వాదానికి తావేలేని బాబా ఆధ్యా

త్మిక అధికారమే, ఆయన నిజతత్వాన్ని వ్యక్తపరచి, సందేహ నివృత్తి చేస్తుంది.

బాబా ఎంతటి కరుణామయుడు? తాను పురాణ పురుషుడనని, సర్వోత్తముడనని, తన దివ్య జన్మ రహస్యాన్ని వెల్లడించి, మానవ హృదయ క్షేత్రంలో ప్రేమ బీజాన్ని నాటటమే కాక, మొలకెత్తించి తన కాలములోనే అభివృద్ధిపరచారు. ఆయన తన ప్రేమికుల ప్రేమకు బానిస నని చెపుతూ పరిశుద్ధ మనస్సుతో నూటికి నూరు పాళ్ళ నిజాయితీగా తనను ధ్యానిస్తే తాను అద్భుతాలు చేయకపోయినా, తన ప్రేమను కోరేవాడు తనకు ఇష్టమైన వాడు కనుక తనలో చేర్చుకుంటానన్నారు.

"నేను సర్వోన్నతుడను కాకపోయినచో, మిమ్ములను సాధువులు, యోగులనబడు వారిని దర్శించడని ప్రోత్సహించి వుండేవాడిని. వారిని గూర్చి ఘనంగా పొగిడియుండే వాడిని. భగవంతుడు స్వయంగా మానవుల మధ్య మానవుడై అవతరించి యుండగా, ఆయనకు సమకాలికులుగా మీకు ప్రత్యక్ష సంబంధ మేర్పడిన అదృష్టం మీకు వుండగా భగవంతుని బిడ్డ లైన, సాధువుల యొద్దకు, మస్తుల వెంట మీరు ఎందుకు పోయెదరు?" అని బాబా తరచూ వ్యథ చెందేవారు.

ఒక సహవాస్ కార్యక్రమంలో బాబా దర్శనానికి అబ్దుల్ మజీద్ ఖాన్ అనే ఒక బాబాకు ప్రేమికుడు వచ్చాడు. ఉద్యోగ రీత్యా ఆయన కలెక్టర్ ఉద్యోగం చేస్తున్నాడు. తాసీల్దారుగా పనిచేస్తూ అంచెలంచెలుగా పైపదవికి ఎదిగాడు. ఆయనకు, కనిపించిన గురువులందరినీ దర్శించుట, భౌతిక వాంఛలు వ్యక్తపరచి సహాయ మర్థించుట అలవాటు. ఆయన కలెక్టర్ స్థాయికి చేరినా మరింతహోదా పెరగాలన్న కోరిక చావలేదు. అయితే అర్థాం తరంగా, ఆనాటి సహవాస్‌లో మెహెర్‌బాబా, హాజరైన ప్రేమికులెవరూ ఏ మస్తు గగ్గరకు వెళ్ళవద్దని ఆదేశించారు. పాపం, అబ్దుల్ మజీద్‌ఖాన్ ధ్యాసంతా మస్తును కలవాలని ఉబలాటపడింది. చివరకెలాగైతేనేమి,

వరికీ తెలియకుండా ఆనాటి రాత్రి అంతా నిద్రపోయిన తర్వాత మజీద్ ఖాన్ ఒక మస్తును దర్శించుటకు వెళ్ళాడు. అతడలా వెళ్ళుటను గమనించిన పెండూ అనే శిష్యుడు, మర్నాడు మెహెర్‌బాబా దృష్టికి తీసుకువచ్చాడు. వెంటనే బాబా మజీద్ ఖాన్‌ని పిలిపించారు. మస్తును కలవరాదని ఆదేశించినప్పటికీ, నా ఆదేశాన్ని ఎందుకు ఉల్లంఘించావని ప్రశ్నించారు బాబా మీరు సర్వోన్నతులు గదా! ఎటువంటి భౌతికమైన కోరికలతో తమ వద్దకు రావద్దని చెప్పారు కదా! అందువల్ల స్వల్పమైన భౌతిక వాంఛల్ని మిమల్ని కోరుట తగదన్న భావంతో ఆధ్యాత్మికంగా ఉన్నత స్థాయిలో ఉన్న మస్తు దగ్గరకు వెళ్ళాన"ని నిజం ఒప్పుకున్నాడు.

అప్పుడు బాబా "నేను ఉన్నతోన్నతుడనైనప్పటికీ, నా ప్రేమికులకు ఆధ్యాత్మిక లబ్ధిని మాత్రమేకాక, భౌతిక వాంఛల్ని కూడా తీరుస్తానని నీవు గ్రహించలేక పోయావు. కోరికల నుంచి విముక్తులయ్యేవరకూ అజ్ఞాన పాశం నుండి విముక్తి పొందలేరు. కోరికలున్నంతవరకూ స్వేచ్ఛ లేదు. నిష్కాముడైతే రాజులకే రాజవుతాడు. ఆత్మ ఒక పక్షిలాంటిది. కోరికలన్నీ పోయాక, ఆ పక్షి కళ్ళు తెరుస్తుంది. అప్పుడది భగవంతుడ్ని చూచి ఆయనలో ఐక్యమైపోతుంది. నేనే భగవంతుడ్ని. అయితే కోరికలు ఆ పక్షిని గుడ్డిదాన్ని చేశాయి. నేను దాని ఎదురుగా నిలబడి ఉన్నప్పటికీ అది నన్ను చూడలేక పోయింది" అంటూ నర్మగర్భంగా అబ్దుల్ మజీద్ ఖాన్‌లో పశ్చాత్తాపాన్ని రగిల్చారు.

దీనిని బట్టి కోరికలెంత భయంకరమైనవో గ్రహించవచ్చును. అవిశ్రాంతంగా పనిచేసే మనస్సు అనుక్షణం కోరికలతో నిండి, వాటి సాధనలో ఊహాలోకంతోపాటు మాయా సుఖాన్ని సృష్టించుకుంటోంది. ఇంద్రియ భోగాలనుభవించే మనస్సు వాటి వైపే పరుగిడుతుందే తప్ప ప్రియతముని అనుగ్రహాన్ని సంపాదించుటకు వెంపర్లాడలేదు. అందుకే మెహెర్‌బాబా తరచూ "నన్ను ప్రేమించు- నన్ను స్మరించు" అంటూ హెచ్చరించేవారు. బాబాపైనే మనస్సును లగ్నం చేయకలిగితే ప్రియతముని

కృపా కటాక్షములు లభించి, ఆయనకు చేరువ కాగలుగుతాం. అప్పు అంతర్గతంలో అవిచ్ఛన్నమైన కోరికల పరిత్యాగం ప్రారంభమవుతుం సాక్షాత్తు అవతారుడి కొంగు పట్టుకొనే భాగ్యం దొరికినందుకు మనమం ఎంతో అదృష్టవంతులం. యుగావతారుడిగా బాబా అందించిన గురుతుల్య లైన కొన్ని సిద్ధాంతాలను పాఠకుల సౌలభ్యం కొరకు పొందపరచా ఆమూలాగ్రం చదివి, అంతర్భావాల్ని గ్రహించి ప్రియతముని కృపకి పాత్రులు కాగలరని ఆకాంక్షిస్తూ అందరికీ జై బాబా!

| Check List | | | |
|---|---|---|---|
| Book Number | G.V.P01M363 | Date | 11/2/2021 |
| Front Cover | yes | Back Cover | yes |
| Special Pages | CI, 81 | | |
| Missing Pages | NO | | |
| Prepared | G. Sorakelli | Scanned | K. Yameema |
| BOOK SIZE | H 7.0 W 4.9 | Pages | 89 |